బ్రహ్మగ్రన్థిం కుర్యాత్।

ఓం యోగక్షేమస్య క్లుప్త్యై। యుక్తం క్రియాతా ఆశీః కామే యుజ్యాతా ఇతి। ఆశిష స్సమృద్ధ్యై। గ్రన్థిం గ్రన్థాతి। ఆశిష ఏవాస్యాం పరిగృహ్ణాతి। పుమాన్వై గ్రన్థిః స్త్రీ పత్నీ। తన్మిథునం। మిథున మేవాస్య తద్యజ్ఞే కరోతి ప్రజననాయ। ప్రజాయతే ప్రజయా పశుభి ర్యజమానః। అథో అర్థోవా ఏష ఆత్మనః। యత్పత్నీ। యజ్ఞస్య ధృత్యా అశిథిలంభావాయ। సుప్రజసస్త్వా వయగ్ం సుపత్నీ రుపసేదిమేత్యాహ। యజ్ఞమేవ తన్మిథునీ కరోతి। ఊనేతిరిక్తం ధీయా తా ఇతి ప్రజాత్యై। మహీనాం పయోస్యోషధీనాగ్ం రస ఇత్యాహ। రూపమేవాస్యై తన్మహిమాననం వ్యాచష్టే। తస్య తే క్షీయ మాణస్య నిర్వపామి దేవ యజ్యాయా ఇత్యాహ। ఆశిష మే వైతా మా శాస్తే। అగ్నే విశ్వేభి స్స్వనీక దేవై రూర్ణావంతం ప్రథమ స్సీద యోనిం। కులాయినం ఘృతవంతగ్ం సవిత్రే యజ్ఞం నయ యజమానాయ సాధు। యోవైతాం బ్రహ్మణో వేద। అమృతేనావృతాం పురీం। తస్మై బ్రహ్మచ బ్రహ్మాచ। ఆయుః కీర్తిం ప్రజాం దదుః॥

బ్రహ్మగ్రన్థి ముహూర్త స్సుముహూర్తో అస్తు।

తతో వధూవరౌ సంకల్ప్య....... పాణిగ్రహణాంగత్వేన ఆవయోః రక్షార్థం రక్షాబంధనం కరిష్యే - పూజాం కృత్వా। విశ్వేత్తాతేతి వరస్య దక్షిణే హస్తే, బృహత్సామేతి కన్యకాయా వామకరే, రక్షాం బధ్నీయాత్।

రక్షాబంధనముహూర్తస్సుముహూర్తో అస్తు।

సూ - అథైనా ముత్తరయా దక్షిణే హస్తే గృహీత్వా అగ్ని మభ్యానీయ।

తూష్ణీం దక్షిణ హస్తం గృహీత్వా, అగ్నిం ప్రతి వధూం అనేన మంత్రేణ ఆనయేత్। పూషాత్వేతోనయతు హస్త గృహ్యాశ్వినౌత్వా ప్రవహ తాగ్ం రథేన। గృహాన్గచ్ఛ గృహపత్నీ యథాఽసో వశినీత్వం విదథ మావదాసి॥

## ప్రధానహోమః

సూ॥ అపరేణాగ్నిం ఉదగగ్రం కటమాస్తీర్య తస్మిన్నుపవిశత ఉత్తరోవరః

ఆచమ్య...... ఏవం ప్రీత్యర్థం అనయా నవోఢయా వధ్వాసహ ఆయురభివృద్ధ్యర్థం వివాహ ప్రధాన హోమం కరిష్యే -

అగ్నేరుప సమాధానాది పాత్ర ప్రయోగకాలే ఏవం పాత్రాసాదనం కుర్యాత్

శ్లో॥వధ్వంజలిం హోమ విధాన దర్వీం ద్వితీయదర్వీం సహ చాజ్య ధాన్యా। ప్రోక్షార్థ పాత్రేణ సహ ప్రణీతా మిధ్మేన శమ్యా స్సహ లాజ మశ్మ॥

అత్ర వధూ హస్తయోస్సాదన, ప్రోక్షణ, తపన, సమ్మార్జనాని కుర్యాత్।

పవిత్ర కరణాద్యాజ్య భాగాంతే।

సూ - అథైనామాదితో ద్వాభ్యా మభి మంత్రయేత।

ఓం సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః। తృతీయో అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్య జాః। సోమోఽదదద్గంధర్వాయ గంధర్వోఽ

దదద్గ్నయే। రయించ పుత్రాగ్శ్చాదా ద్గ్ని ర్మహ్యా మథో ఇమామ్।

(ఇతి వధూ హృదయ మభిమంత్ర్య)

సూ - అథాస్యై దక్షిణేన నీచాహస్తేన దక్షిణముత్తానగ్ం హస్తం గృహ్ణీయాత్, యదికామయేత స్త్రీరేవ జనయేయమిత్యంగులీ రేవ గృహ్ణీయాత్। యది కామయేత పుగ్ంస ఏవ జనయేయ మిత్యంగుష్ఠ మేవ। సోఽభీవాంగుష్ఠ మభీవ లోమాని గృహ్ణాతి। గృభ్ణామిత ఇత్యేతాభి శ్చతసృభిః।

ఓం గృభ్ణామితే సుప్రజాస్త్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్యథాఽసః ।భగో అర్యమా సవితా పురన్ధిర్మహ్యాం త్వాఽదుర్గార్హ పత్యాయ దేవాః। తేహ పూర్వే జనాసో యత్ర పూర్వవహో హితాః। మూర్ధన్వాన్ యత్ర సౌభ్రవః పూర్వో దేవేభ్య ఆతపత్। సరస్వతి ప్రేదమవ సుభగే వాజినీవతీ, తాం త్వా విశ్వస్య భూతస్య ప్రగాయా మస్యగ్రతః। య ఏతి ప్రదిశ స్సర్వా దిశోఽను పవమానః। హిరణ్యహస్త ఐరంమస్సత్వా మన్మనసం కృణోతు।

అన్తే హస్త గ్రహణమ్।

సూ - అథైనా ముత్తరేణాగ్నిం దక్షిణేన పదా ప్రాచీ ముదీచీం వా దిశ మభి ప్రక్రమయత్యేకమిష ఇతి, సఖేతి సప్తమే పదే జపతి।

ఓం ఏకమిషే విష్ణు స్త్వాన్వేతు। ద్వే ఊర్జే విష్ణు స్త్వాన్వేతు। త్రీణి వ్రతాయ విష్ణు స్త్వాన్వేతు। చత్వారి మాయోభవాయ విష్ణుస్త్వాన్వేతు। పంచ పశుభ్యో

విష్ణు స్త్వాన్వేతు। షడృతుభ్యో విష్ణుస్త్వాన్వేతు। సప్త సప్తభ్యో హోత్రాభ్యో విష్ణుస్త్వాన్వేతు। సఖా సప్తపదా భవ సఖాయౌ సప్తపదా బభూవ సఖ్యంతే గమేయగ్ం సఖ్యాత్తే మాయోషగ్ం సఖ్యాన్మే మాయోష్ఠా స్సమయావ సంకల్పావహై సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ। ఇష మూర్జ మభి సంవసానౌ సంనౌ మనాగ్ంసి సంవ్రతా సముచిత్తాన్యాకరమ్। సాత్వమస్య మూహమ మూహమస్మి సాత్వం ద్యౌరహం పృథివీత్వగ్ం రేతో౽హగ్ం రేతో భృత్త్వం మనో౽హ మస్మి వాక్త్వగ్ం సామాహ మస్మ్యృక్త్వగ్ం సామా మనువ్రతా భవ పుగ్ంసే పుత్రాయ వేత్తవై శ్రియై పుత్రాయ వేత్తవ ఏహి సూనృతే।

సూ – పాగ్ఘోమాత్ప్రదక్షిణ మగ్నిం కృత్వా యథాస్థాన ముపవిశ్యా న్వారబ్ధాయా ముత్తరా ఆహుతీ ర్జుహోతి సోమాయ జనివిదే స్వాహే త్యేతైః ప్రతిమంత్రమ్॥

1. ఓం సోమాయ జనివిదే స్వాహా॥

సోమాయ జనివిద ఇదం నమమ।

2. ఓం గంధర్వాయ జనివిదే స్వాహా॥

గంధర్వాయ జనివిద ఇదం నమమ।

3. అగ్నయే జనివిదే స్వాహా॥

అగ్నయే జనివిద ఇదం నమమ।

4. కన్యలా పితృభ్యోయతీ పతిలోక మవదీక్షా మదాస్థ స్వాహా॥

వధ్వై సూర్యాయా ఇదం నమమ।

5. ప్రేతో ముంచాతి నాముత స్సుబద్ధా మముత స్కరత్। యథేయ మింద్రమీఢ్వ స్సుపుత్రా సుభగా సతి స్వాహా। ఇంద్రాయ మీఢుష ఇదం నమమ।

6. ఇమాం త్వమింద్ర మీఢ్వస్సుపుత్రాగ్ం సుభగాం కృణు।
దశాస్యాం పుత్రానాధేహి పతిమేకాదశం కృధి స్వాహా। ఇంద్రాయ మీఢుష ఇదం నమమ।

7. అగ్నిరైతు ప్రథమో దేవతానాగ్ం సోఽస్యై ప్రజాం ముంచతు మృత్యుపాశాత్। తదయగ్ం రాజా వరుణోఽను మన్యతాం యథేయగ్గ్ స్త్రీ పౌత్రమఘం న రోదాత్స్వాహా। అగ్నీ వరుణాభ్యా మిదం నమమ।
8. ఇమా మగ్ని స్త్రాయతాం గార్హపత్యః ప్రజామస్యై నయతు దీర్ఘమాయుః। అశూన్యోపస్థా జీవ తామస్తు మాతా పౌత్ర మానంద మభి ప్రబుధ్యతా మియగ్గ్ స్వాహా। అగ్నయే గృహపతయ ఇదం నమమ।
9. మాతే గృహే నిశిఘోష ఉత్థాదన్యత్ర త్వద్రుదత్యస్సంవిశంతు। మా త్వం వికేశ్యుర విధిష్ఠా జీవపత్నీ పతిలోకే విరాజ పశ్యన్తీ ప్రజాగ్ం సుమనస్య మానాగ్ స్వాహా। వధ్వై సూర్యాయా ఇదం నమమ।
10. ద్యాస్తే పృష్ఠగ్ం రక్షతు వాయురూరూ అశ్వినౌచ స్తనంధయంతగ్ం సవితాఽభి రక్షతు। ఆవాససః పరిధానా ద్బృహస్పతి ర్విశ్వే దేవా

అభిరక్షన్తు పశ్చాత్స్వాహా। ద్యువాయ్వశ్విసవితృ, బృహస్పతి విశ్వేభ్యో దేవేభ్య ఇదంనమమ।

11. అప్రజస్తాం పౌత్రమృత్యుం పాప్మానముతవాఽఘమ్।శీర్ష్ణ స్రజమివోన్ముచ్య ద్విషద్భ్యః। ప్రతి ముంచామి పాశగ్గ్ స్వాహా। వహ్నిసూర్యాయా ఇదంనమమ।

12. ఇమంమే వరుణ శ్రుధీహవ మద్యాచ మృడయ। త్వామవశ్యు రాచకే స్వాహా। వరుణాయేదంనమమ।

13. తత్వాయామి బ్రహ్మణా వంద మానస్తదా శాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ంస మాన ఆయుః ప్రమోషీ స్వాహా। వరుణాయేదంనమమ।

14. త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడోఽవయాసిసీష్ఠాః। యజిష్ఠో వహ్నితమః శోశుచానో విశ్వాద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్యస్మత్స్వాహా। అగ్నీ వరుణాభ్యామిదం నమమ।

15. సత్వన్నో అగ్నేఽవమోభవోతీ నేదిష్ఠో అస్యా ఉషసోవ్యుష్టౌ। అవయక్ష్వనో వరుణగ్ం రరానో వీహి మృడీకగ్ం సుహవోనఏధిస్వాహా। అగ్నీ వరుణాభ్యామిదం నమమ।

16. త్వమగ్నే అయాస్య యాసన్ మనసాహితః।
అయాసన్ హవ్యమూహిషేఽ యానోధేహిభేష జగ్ స్వాహా।

అయసేఽగ్నయ ఇదంనమమ।

సూ - అథైనాముత్తరేణాగ్నిం దక్షిణేన పదాఽ శ్మానమాస్థాపయత్యా తిష్ఠేతి।

ఓం ఆతిష్ఠేమ మశ్మాన మశ్మేవ త్వగ్గ్ స్థిరాభవ। అభితిష్ఠ పృతన్యత స్సహస్వ పృతనాయతః॥

సూ - అథాస్యా అంజలా వుపస్తీర్య, ద్విర్లాజానోప్య అభిఘారయతి। తస్యాస్సోదర్యో లాజానావపతీత్యేకే। (త్రిర్జమదగ్నీనాం) జుహోతీయం నారీతి।

మం - ఇయం నార్యుపబ్రూతే కుల్పాన్యావపన్తికా। దీర్ఘాయురస్తు మేపతిర్జీవాతు శరదశ్శతగ్గ్ స్వాహా॥ వధ్వా ఇదంనమమ।

సూ - ఉత్తరాభి స్తిసృభిః ప్రదక్షిణ మగ్నిం కృత్వాఽ శ్మాన మా స్థాపయతి యథాపురస్తాత్।

మం - ఓం తుభ్య మగ్రే పర్యవహన్సూర్యాం వహతునా సహ। పునః పతిభ్యో జాయాందా అగ్నే ప్రజయా సహ। పునః పత్నీ మగ్నిరదా దాయుషా సహ వర్చసా। దీర్ఘాయురస్యాయః పతిస్సఏతు శరద శ్శతమ్। విశ్వా ఉత త్వయా వయం ధారా ఉదన్యా ఇవ। అతిగాహేమహి ద్విషః । ఆతిష్ఠేమ మశ్మాన మశ్మేవ త్వగ్గ్స్థి రాభవ। అభితిష్ఠ పృతన్యత స్సహస్వ పృతనాయతః॥

సూ - హోమశ్చోత్తరయా।

ఓం అర్యమణం ను దేవం కన్యా అగ్నిమయక్షత। సఇమాం దేవో అధ్వరః ప్రేతో ముంచాతి నాముత స్సుబద్ధా మముతస్కరత్స్వాహా।

అగ్నయే అర్యమ్ణ ఇదం నమమ।

సూ - పునః పరిక్రమణం, ఆస్థాపనమ్।

ఓం తుభ్య మగ్రే...... మహి ద్విషః।

ఓం ఆతిష్ఠేమమశ్మాన...... పృతనాయతః॥

సూ - హోమ శ్చోత్తరయా।

ఓం త్వమర్యమా భవసి యత్క నీనాం నామస్స్వధా వథ్స్వర్యం బిభర్షి। అంజంతి వృక్షగ్ం సుధితం న గోభిర్యద్దంపతీ సమనసా కృణోషి స్వాహా॥ అర్యమ్ణ ఇదం నమమ॥

సూ - పునః పరిక్రమణం, ఆస్థాపనమ్।

ఓం తుభ్య మగ్రే...... మహి ద్విషః।

సూ - ఇధ్మ సన్నహనం, జయాది ప్రతిపద్యతే పరిషేచనాంతం కృత్వా ఉత్తరాభ్యాం యోక్త్రం విముచ్య।

మం - ప్రత్వాముంచామి వరుణస్య పాశాద్యేన త్వాఽబధ్నా థ్సవితా సుకేతః। ధాతుశ్చయోనౌ సుకృతస్య లోకే స్యోనంతే సహ పత్యా కరోమి॥ ఇమం విష్యామి వరుణస్య పాశం యమ బధ్నీత సవితా సుశేవః। ధాతుశ్చ యోనౌ సుకృతస్య లోకేఽరిష్టాం త్వా సహ పత్యా కృణోమి॥

అనేన ప్రధానహోమ కర్మణా భగవాన్ సర్వాత్మకః పరమేశ్వర స్సుప్రీణాతు॥

సూ - తాం తతః ప్రవావాహయేత్ప్రవాహోరయేత్। సమోహ్యైత మగ్నిమను హరంతి। నిత్యః। ధార్యః। అనుగతోమన్థ్యః। శ్రోత్రియాగారాద్వాఽహోర్యః । ఉపవాస శ్చాన్యతరస్య భార్యాయాః పత్యుర్వా। అనుగతేఽపివోత్తరయా జుహుయాన్నోపవసేత్.

ఓం అయాశ్చాగ్నేస్య నభిశస్తీశ్చ సత్యమిత్త్వ మయా అసి। అయసా మనసా ధృతోఽయసా హవ్య మూహిషేఽ యానోధేహి భేషజగ్గ్ స్వాహా॥

## ప్రయాణతంత్రమ్ యద్భుతాది హోమాశ్చ

సూ: ఉత్తరారథస్యోత్తంభనీ ।

మం. సత్యేనోత్తభితా భూమి స్సూర్యేణోత్తభితా ద్యౌః । ఋతేనాదిత్యా స్తిష్ఠన్తి దివిసోమో అధిశ్రితః ।

సూ: వాహోవుత్తరాభ్యాం యునక్తి దక్షిణమగ్రే ।

మం. యుఞ్జన్తి బ్రధ్న మరుషం చరన్తం పరితస్థుషః । రోచంతే రోచనాదివి ।

సూ: ఉత్తరంతతః ।

మం. యోగే యోగే తవస్తరం వాజే వాజే హవామహే । సఖాయ ఇంద్ర మూతయే ॥

సూ: ఆరోహతీ ముత్తరాభిరభిమంత్రయతే ।

మం. సుకిగ్ం శుకగ్ం శల్మలిం విశ్వరూపగ్ం హిరణ్య వర్ణగ్ం సువృతగ్ం సుచక్రమ్ । ఆరోహవధ్వమృతస్య లోకగ్గ్స్యోనం పత్యేవహతుం కృణుష్వ। ఉదుత్తరమారోహన్తీ వ్యస్యన్తీ పృతన్యతః । మూర్ధానం పత్యురారోహ ప్రజయా చ విరాడ్భవ । సమ్రాజ్ఞీశ్వశురేభవ సమాజ్ఞీ శ్వశ్రువాం భవ । ననాన్దరి సమ్రాజ్ఞీ భవ సమ్రాజ్ఞీ అధిదే వృషు । స్నుషాణాగ్ శ్వశురాణాం ప్రజాయాశ్చ ధనస్యచ । పతీనాం చ దేవృణాం చ సజాతానాం విరాడ్భవ ।

సూ॥ సూత్రేవర్త్మ నోర్వ్యవస్తృణాతి । ఉత్తరయా నీలం దక్షిణస్యాం । లోహిత ముత్తరస్యామ్ ।

మం॥ నీలలోహితే భవతః కృత్యా సక్తిర్వ్యజ్యతే । ఏధన్తేఽస్యా జ్ఞాతయః పతిర్బన్ధేషు బధ్యతే ॥

సూ॥ తే ఉత్తరాభిరభియాతి

మం॥ యే వధ్వశ్చంద్రం వహతుం యక్ష్మాయన్తి జనాగ్ం అను । పునస్తాన్ యజ్ఞియా దేవానయంతు యత ఆగతాః మావిదన్పరి పన్థినో య ఆసీదన్తి దంపతీ । సుగేభిర్దుర్గ మతీ

మపద్రాన్త్వరాతయః । సుగం పన్థాన మారుక్ష మఒష్టగ్గ్ స్వస్తి వాహనమ్ । యస్మిన్వీరో నరిష్యత్యన్యేషాం విన్దతేవసు ।

సూ॥ తీర్థస్థాణు చతుష్పథ వ్యతిక్రమే చోత్తరాం జపేత్ ।

మం॥ తామందస్తానా మనుషోదురోణ ఆధత్తగ్ం రయిం దశవీరం వచస్యవే కృతం తీర్థగ్ం సుప్రపాణగ్ం శుభస్పతీస్థాణుం పథేష్ఠా మపదుర్మతిగ్ం హతమ్ ॥

సూ॥ నావముత్తరయానుమంత్రయతే ।

మం॥ అయన్నో మహ్యాః పారగ్గ్ స్వస్తినేషద్వనస్పతిః । సీరానస్సుతరా భవదీర్ఘాయుత్వాయ వర్చసే ॥

సూ॥ నచనావ్యాగ్ స్తరతీ వధూః పశ్యేత్ । తీర్త్వోత్తరాం జపేత్ ।

మం॥ అస్యపారే నిర్‌బుతస్య జీవాజ్యోతి రశీమహి । మహ్యా ఇంద్ర స్వస్తయే ।

సూ॥ శ్మశానాధి వ్యతిక్రమే భాండే రథే వారిష్టేఽగ్నేరుప సమాధానాద్యాజ్యభాగాన్తేఽన్వారబ్ధాయహామ్ముత్తరా ఆహుతీర్హుత్వా ।

మం॥ యద్ధృతేచి దభిశ్రిషః పురాజర్తృభ్య ఆతృదః । సన్ధాతా సంధిం

మఘవా పురోవసుర్ని ష్కర్తా విహ్రుతం పున స్స్వాహా ॥
మఘవత ఇదం నమమ

మం॥ ఇడామగ్నే పురుదగ్ం సగ్ంసనిం గోశ్శశ్వత్త మగ్ం
హవమానాయ సాథ। స్యాన్నస్సూనుస్తనయో విజావాగ్నే సాతే
సుమతి ర్భూత్వస్మే స్వాహా ॥ అగ్నయ ఇదం నమమ

మం॥ ఇమం మే వరుణ శ్రుధీహవ మద్యాచమృడయ । త్వామ
వస్యురాచకే స్వాహా ॥ వరుణాయేదం

మం॥ తత్వాయామి.....ఆయుః ప్రమోషీ స్వాహా ॥ వరుణాయేదం
నమమ

మం॥ త్వన్నోఅగ్నే....ప్రముముగ్ధ్యస్మత్స్వాహా ॥ అగ్నీవరుణాభ్యా
మిదంనమమ

మం॥ సత్వన్నోఅగ్నే.....సుహవోన ఏధి స్వాహా ॥
అగ్నీవరుణాభ్యామిదం నమమ

మం॥ త్వమగ్నే అయాస్యయాసన్మనసాహితః । అయాసన్
హవ్యమూహిషేఽయానోధేహి భేషజగ్గ్ స్వాహా ॥
అయసేఅగ్నయ ఇదంనమమ

సూ॥ జయాది ప్రతిపద్యతే పరిషేచనాంతం కరోతి ।

సూ॥ క్షీరిణా మన్యేషాం వా లక్ష్మణ్యానాం వృక్షాణాం నదీనాం ధన్వనాంచ వ్యతిక్రమ ఉత్తరే యథాలింగం జపేత్ ।

మం॥ యేగన్ధర్వా అప్సరసశ్చ దేవీరేషు వృక్షేషు వానస్పత్యేష్వాసతే । శివాస్తే అస్యై వధ్వై భవన్తు మాహిగ్ంసిషుర్వహతు మూహ్యమానామ్ ॥

యా ఓషధయో యా నద్యో యాని ధన్వాని యే వనా । తే త్వావధు ప్రజావతీం ప్రత్వేముంచన్త్వగ్ం హసః

సూ॥ గృహానుత్తరయా సంకాశయతి ।

మం॥ సంకాశయామి వహతుం బ్రహ్మణాగృహై రఘోరేణ చక్షుషా మైత్రేణ। పర్యాణద్ధం విశ్వరూపం యదస్యాగ్ స్యోనం పతిభ్య స్సవితా కృణోతుతత్।

సూ॥ వాహావుత్తరాభ్యాం విముఞ్చతిదక్షిణమగ్రే ।

మం॥ ఆవామగన్థు మతిర్వాజినీ వసూన్యశ్వినా హృత్సు కామాగ్ం అయగ్ంసత। అభూతం గోపా మిథునా శుభస్పతీ ప్రియా అర్యమ్ణో దుర్యాగ్ం అశీమహి । అయన్నోదేవ స్సవితా

బృహస్పతి రిన్ద్రాగ్నీ మిత్రా వరుణా స్వస్తయే । త్వష్టావిష్ణుః ప్రజయా సగ్ం రరాణః కామ ఆయాతం కామాయత్వా విముంచతు ॥

సూ॥ లోహితం చర్మానడుహం ప్రాచీనగ్రీవ ముత్తరలోమ మధ్యేఽగార స్యోత్తరయాఽస్తీర్య

మం॥ శర్మవర్మే దమాహరాస్యై నార్యా ఉపస్తిరే । సినీవాలి ప్రజాయతా మియం భగస్య సుమతా అసత్ ।

సూ॥ గృహాన్ ప్రపాదయన్నుత్తరాం వాచయతి దక్షిణేన పదా ।

మం॥ గృహాన్ భద్రాన్సుమనసః ప్రపద్యేఽవీరఘ్నీ వీరవత స్సువీరాన్ । ఇరాం వహతో ఘృత ముక్ష మాణాస్తేష్వహగ్ం సుమనా స్సంవిశామి।

సూ॥ న చ దేహళీ మభితిష్ఠతి ।

ఇతి తాంతతేత్యాది సూత్రప్రభృతి స్వగృహ ఆగమన సూత్రపర్యంత విధిః

* * * * * *

# ప్రవేశ హోమః

ఆచమ్య...... ఏవం ప్రీత్యర్థం అనయా నవోఢయా వధ్వా సహ వివాహ గృహప్రవేశ హోమం కరిష్యే। ఇతి సంకల్ప్య। ఉత్తరో వరః।

సూ - ఉత్తర పూర్వదేశేఽగారస్యాగ్నేరుప సమాధానాది ఆజ్యభాగాంతే అన్వారబ్ధాయాముత్తరా ఆహుతీర్హుత్వా।

1. ఓం ఆగన్గోష్ఠం మహిషీ గోభిరశ్వై రాయుష్మత్పత్నీ ప్రజయా స్వర్విత్। బహ్వీం ప్రజాం జనయన్తీ సురత్నేమ మగ్నిగ్ం శతహిమా స్సపర్యాత్స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

2. అయ మగ్నిర్గృహపతిస్సుసగ్ం సత్పుష్టివర్ధనః। యథా భగస్యాభ్యాం దదద్రయిం పుష్టిమథో ప్రజాగ్ స్వాహా॥ అగ్నయే గృహపతయ ఇదం నమమ॥

3. ప్రజాయా అభ్యాం ప్రజాపత ఇన్ద్రాగ్నీ శర్మయచ్ఛతమ్। యథైనయో ర్నప్రమీయాతా ఉభయో ర్జీవతోః ప్రజాస్స్వాహా॥ ఇంద్రాగ్నిభ్యామిదం నమమ।

4. తేన భూతేన హవిషాఽయ మాప్యాయతాం పునః। జాయాం యామస్మా ఆవాక్షుస్తాగ్ం రసేనాభి వర్ధతాగ్ స్వాహా। ఇంద్రాగ్నిభ్యామిదం నమమ।

5. అభివర్ధతాం పయసాఽభి రాష్ట్రేణ వర్ధతామ్। రయ్యా సహస్ర

పోషస్సే మౌ స్తా మనపేక్షితా స్వాహా॥ ఇంద్రాగ్ని భ్యామిదం నమమ।

6. ఇహైవస్తం మా వియోష్టం విశ్వమాయుర్వ్య శ్నుతమ్। మహ్యా ఇంద్ర స్స్వస్తయేస్వాహా॥ ఇంద్రాయేదం నమమ।

7. ధ్రువైధిపోష్యా మయి మహ్యం త్వాఽదాద్బృహస్పతిః। మయా పత్యా ప్రజావతీ సంజీవ శరదశ్శతగ్గ్ స్వాహా॥ బృహస్పతయ ఇదం నమమ॥

8. త్వష్టా జాయా మజనయ త్త్వష్టాఽ స్యై త్వాం పతిమ్। త్వష్టా సహస్ర మాయూగ్ంషి దీర్ఘమాయుః కృణోతు వాగ్ స్వాహా॥ త్వష్ట్ర ఇదం నమమ॥

9. ఇమంమేవరుణ....... రాచకే స్వాహా॥ వరుణాయేదం నమమ।

10. తత్త్వాయామి ..... ప్రమోషీస్వాహా॥ వరుణాయేదం నమమ।

11. త్వన్నో అగ్నే....... అస్మత్స్వాహా॥ అగ్నీవరుణాభ్యామిదం నమమ।

12. సత్వన్నో అగ్నే... నవధిస్వాహా॥ అగ్నీవరుణాభ్యామిదం నమమ।

13. త్వమగ్నే అయాస్యయాసన్ మనసా హితః। అయాసన్ హవ్య మూహిషేఽ యానో ధేహి భేషజగ్గ్ స్వాహా॥ అయసేగ్నయ ఇదం నమమ॥

సూ – జయాది ప్రతిపద్యతే పరిషేచనాన్తం కృత్వా॥

సూ – ఉత్తరయా చర్మణ్యుప విశత ఉత్తరోవరః

మం। ఇహగావః ప్రజాయధ్వ మిహాశ్వా ఇహ పూరుషాః। ఇహో

సహస్రదక్షిణో రాయస్పోషో నిషీదతు॥

సూ - అథాస్యాః పుగ్గస్వోర్జీవ పుత్రాయాః పుత్రమంక ఉత్తరయోపవేశ్య॥

మం - సోమేనాదిత్యా బలిన స్సోమేన పృథివీ ధృఢా। అథో నక్షత్రాణామేషాముపస్థే సోమ అధితః॥

సూ - తస్మై ఫలాన్యుత్తరేణ యజుషా ప్రదాయ।

మం - ప్రస్వస్థః ప్రేయం ప్రజయా భువనేశోచేష్ట।

సూ - ఉత్తరే జపిత్వా, వాచం యచ్ఛత ఆ నక్షత్రేభ్యః॥

మం॥ ఇహప్రియం ప్రజయాతే సమృధ్యతా మస్మిన్నృహే గార్హపత్యాయ జాగృహి। ఏనాపత్యా తన్వగ్ంం సగ్ంం సృజస్వాధా జీవ్రీ విదథ మావదాసి। సుమంగలీరియం వధూరిమాగ్ంం సమేత పశ్యత। సౌభాగ్య మస్యై దత్వాయాథాస్తం విపరేతన॥

సూ - ఉదితేషు నక్షత్రేషు ప్రాచీముదీచీం వా దిశముపనిష్క్రమ్య ఉత్తరాభ్యాం యథాలింగం ధృవ మరుంధతీం చ దర్శయతి॥

మం - ధ్రువక్షితి ర్ధ్రువయోనిర్ధ్రు వమసి ధ్రువతస్థితమ్। త్వం నక్షత్రాణాం మేథ్యసి సమాపాహి పృతన్యతః॥ సప్తర్షయః ప్రథమాం కృత్తికానా మరుంధతీం యద్ధ్రువ తాగ్ంం హనిన్యుః। షట్కృత్తికా ముఖ్యయోగం వహన్తీయ మస్మాకమేధత్వష్టమీ॥

శ్లో॥ కశ్యపోత్రి ర్భరద్వాజో విశ్వామిత్రోఽథగౌతమః।

వసిష్ఠో జమదగ్నిశ్చ సప్తైతే ఋషయస్తథా॥

శ్లో॥ అరుంధతీ మహాదేవీ వశిష్ఠ ప్రియభామిని।

ఆవయోః రక్షణార్థాయ ఇదమర్ఘ్యం దదామ్యహమ్॥

కశ్యపాది సప్తమహర్షిభ్యో నమః, అరుంధత్యై నమః. ఇదమర్ఘ్యం సమర్పయామీతి, త్రివారం అర్ఘ్య ప్రదానం కుర్యాత్॥

ఇతి ప్రవేశహోమః.

# ఆగ్నేయ స్థాలీపాకః

ఆచమ్య...... ఏవం ప్రీత్యర్థం ఏనాం వధూం ఆగ్నేయేన స్థాలీపాకేన యాజయిష్యే।

సూ - అథైనా మాగ్నేయేన స్థాలీపాకేన యాజయతి। పత్న్యవహంతి। శ్రపయిత్వాऽభిఘార్య, ప్రాచీన ముదీచీనం వోద్వాస్య ప్రతిష్ఠిత మభిఘార్య అగ్నేరుపసమాధానాది ఆజ్యభాగాన్తేऽన్వారబ్ధాయాం స్థాలీపాకా జ్జుహోతి। సకృదుపస్తరణాభిఘారణే ద్విరవ దానమ్। అగ్నిర్దేవతాస్వాహాకారః ప్రదానః । అపివా సకృదుపహత్య జుహుయాత్। అగ్నిస్స్విష్టకృద్ద్వితీయః। సకృదుపస్తరణావదానే ద్విరభిఘారణమ్। మధ్యాత్పూర్వస్యావదానం మధ్యే హోమః। ఉత్తరార్ధా దుత్తరస్య, ఉత్తరార్ధ పూర్వార్ధేహోమః। **అథ ప్రయోగః** - పత్న్యవహంతి చరుగ్ం శ్రపయిత్వాऽభిఘార్య (ప్రాచీనం) ఉదీచీన ముద్వాస్య, ప్రతిష్ఠిత మభిఘార్య। అగ్నేరుప సమాధానాద్యాజ్య భాగాంతే, అన్వారబ్ధాయాం స్థాలీపాకా జ్జుహోతి। స్రుచ్యుపస్తీర్య, చరుమధ్యాత్,

పూర్వభాగాచ్చ ద్విరవదాయ, పశ్చార్థాత్తృతీయం పంచావత్తినః। అభిఘార్య। హవిః ప్రత్యభి ఘారయతి। ఆఘార సంభేదే జుహోతి।.

ఓం అ॒గ్నయే॒ స్వాహా॑॥ అగ్నయ ఇదం..... పున స్స్రుచ్యుపస్తీర్య, ఉత్తరార్థాత్సకృత్ స్విష్టకృతేవదాయ, (పంచావత్తినః ద్విరవదానమ్) ద్విరభిఘార్య। న హవిః ప్రత్యభిఘారయతి। ఈశాన్య భాగే జుహోతి। ఓం అ॒గ్నయే॑ స్విష్టకృ॒తే॒ స్వాహా॑॥ అగ్నయే స్విష్టకృత ఇదం......

సూ - లేపయోః ప్రస్తరవత్తూష్ణీం బర్హిరక్త్వాగ్నౌ ప్రహరతి। సిద్ధముత్తరం పరిషేచనమ్॥ దర్వ్యా పరిధీ నసక్తి।

ప్రయోగః - పాత్ర ప్రయుక్త దర్భాగ్రాణి దర్వ్యామభ్యజ్య, స్రువే మధ్యమూలే అనక్తి। మూలాంజనే దక్షిణం పాణి మధః కుర్యాత్। ఏవంత్రిః। కించిత్తృణ మపాదాయ, ప్రజ్ఞాతం నిధాయ। పాణిభ్యాం శేషదర్భాన్ దర్వ్యాం ప్రతిష్ఠాప్య। హుత దేవతా ఉద్దిశ్యాగ్నౌ ప్రహరతి। ప్రజాపతయ ఇదం నమమ। ఇంద్రాయేదం। అగ్నయ ఇదం నమమ॥ సోమాయేదం। అగ్నయ ఇదం। అగ్నయే స్విష్టకృత ఇదం। అంజలినా త్రిరుద్ధృత్య, తృణం ప్రహరతి। త్రిరంగుళ్యా నిర్దిశ్య, ఏతత్, ఏతత్, ఏతత్। అగ్నిమభిమంత్ర్య, భూమి ముపస్పృశేత్। మధ్యమ పరిధిం ప్రహృత్య। ఇత రౌ యుగపత్ప్రహరన్న్। ఉత్తరార్ధస్యాగ్రమంగారేషూపోహతి। పరిధీ నభిమంత్ర్య। ఆఘార సమిధౌ ప్రహరతి। తనుభ్య ఇదం నమమ॥ దర్వ్యా మితర దర్వ్యగ్రమవధాయ। సగ్గ్స్రావేణాభి జుహోతి। వసుభ్యోరుద్రేభ్య ఆదిత్యేభ్యస్సగ్గ్ స్రావభాగేభ్య ఇదం నమమ॥ అస్మిన్నాగ్నేయ స్థాలీపాక హోమే కర్మణ్య విజ్ఞాత ప్రాయశ్చిత్తాని కరిష్యే.

ఓం అనా జ్ఞాతం.. యథాతథగ్గ్ స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

ఓ పురుషసమ్మితో...... తథగ్గ్ స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

ఓం యత్పాకత్రా.. యజాతి స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

ఓం త్వన్నో అగ్నే.. స్మత్స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

సత్వన్నో అగ్నే.... న ఏధి స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

ఓం ఆభిర్గీభిర.... స్యామ స్వాహా। ఇన్ద్రాయ హరివత ఇదం నమమ॥ ఓం

ఇదం విష్ణుర.. సురే స్వాహా॥ మహావిష్ణవ ఇదం నమమ॥

ఓం త్ర్యంబకం.. మామృతాత్స్వాహా॥ త్ర్యంబకా యేదం నమమ॥

ఓం యద్విద్వాగ్ంసో...... ముంచతాగ్స్వాహా॥ అగ్నయే శ్రద్ధాదేవ్యా ఇదం

నమమ॥

ఓం అస్మాందద్యోః...... మహి స్వాహా॥ స్కన్నాదిభ్యో దేవతాభ్య ఇదం నమమ॥

ఓం యన్మ ఆత్మనో.... విచర్షణిస్వాహా। మిందాదిభ్యో దేవతాభ్య ఇదం

నమమ॥

ఓం పునరగ్ని...... మక్ష్యోస్వాహా। అగ్నీంద్ర బృహస్పత్యశ్విభ్య ఇదం నమమ।

ఓం పునస్త్వాదిత్యా...... కామాస్వాహా। అగ్నయే వసునీథాయేదం నమమ।

ఓం భూస్స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

ఓం భువస్స్వాహా॥ వాయవ ఇదం నమమ॥

ఓం సువస్స్వాహా॥ సూర్యాయేదం నమమ॥

ఓం భూర్భువస్సువస్స్వాహా॥ ప్రజాపతయ ఇదం నమమ॥

ఏతావత్పర్యన్తం నానా ప్రకారేణ సంభావిత సకల దోష నిర్హరణార్థం సర్వ ప్రాయశ్చిత్తం కరిష్యే.

ఓం భూర్భువస్సువస్స్వాహా॥ ప్రజాపతయ ఇదం నమమ॥

ఓం అదితేన్వ మగ్గ్‌స్థాః.. ప్రాసావీః॥ పూర్ణ పాత్ర మాదాయ.. అహం భో అభివాదయే॥

సూ - తేన సర్పిష్మతా బ్రాహ్మణం భోజయేత్। యోఽస్యా పచితస్తస్మా ఋషభం దదాతి। ఏవమత ఊర్ధ్వం దక్షిణావర్జం ఉపోషితాభ్యాం పర్వసు కార్యః। పూర్ణ పాత్రస్తు దక్షిణేత్యేకే।

## ఔపాసనమ్

సూ - సాయం ప్రాతరత ఊర్ధ్వం హస్తేనైతే ఆహుతీ తండులైర్యవైర్వా జుహుయాత్॥ స్థాలీపాకవద్దైవతమ్। సౌరీ పూర్వాహుతిః ప్రాతరిత్యేకే। ఉభయతః పరిషేచనం యథాపురస్తాత్॥

ఆచమ్య.. ప్రాణానాయమ్య। ఔపాసనమారప్స్యే తేన యావజ్జీవం హోష్యామి। ఇతి ఉభావపి సంకల్పం కుర్యాత్। పునః ప్రాణానాయమ్య। సాయ మౌపాసన హోమం తండులైర్ హోష్యే।

ఓం భూర్భువస్సువరోం.. చత్వారిశృఙ్గా.. అలంకరణాన్తం కృత్వా। అదితేను మన్యస్వేత్యగ్నిం పరిషిచ్య। తండులానాదాయ ద్వేధా విభజ్య। ఓం అగ్నయే

స్వాహా। మధ్యేగ్నౌ జుహోతి। అగ్నయఇదంనమమ.

ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా। అగ్నయే స్విష్ట కృత ఇదం నమమ॥

ఆహుతి సంసర్గదోష నిర్హరణార్థం వనస్పతి హోమంకరిష్యే। ఓం యత్రవేత్థ వనస్పతే దేవానాం గుహ్యానామాని। తత్ర హవ్యాని గామయ। వనస్పతయ ఇదంనమమ॥

ఓం అదితేన్వమగ్గ్‌స్థాః.. ప్రాసావీః।

ఓం అగ్నే త్వన్నో అంతమః। ఉతత్రాతా శివో భవ వరూథ్యః। తం త్వా శోచిష్ఠ దీదివః। సుమ్నాయ నూన మీమహే సఖిభ్యః। వసురగ్ని ర్వసుశ్రవాః । అచ్ఛానక్షి ద్యుమత్తమో రయిందాః। సనోబోధి శ్రుధీహవ మురుష్యాణో అఘాయు తస్సమస్మాత్। హోమ సాద్గుణ్యార్థం అనాజ్ఞాత త్రయ మంత్రజపం కరిష్యే అనాజ్ఞాతం...... యథాతథమ్।

ఓం పురుష సమ్మితో.. హివేత్థయథాతథమ్।

ఓం యత్పాకత్రా.. ఋతుశో యజాతి। అనేన సాయమౌపాసన హోమేన కర్మణా భగవాన్ సర్వాత్మకః పరమేశ్వరస్సుప్రీణాతు। ఏతత్ఫలమ్ పరమేశ్వరార్పణమస్తు ॥స్వస్తి॥ శ్రద్ధాం మేధాం...... అభివాదయే॥

సూ - ఏత దహర్విజానీయాత్। యదహర్భార్యా మావహతే। త్రిరాత్ర ముభయోరధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణ వర్జనం చ। తయోశ్శయ్యా మంతరేణ దండో గంధ లిప్తో వాససా సూత్రేణ వా పరివీత స్తిష్ఠతి।

# గంధర్వ స్థాపనమ్

ఓం విశ్వా వసుగ్ం సోమ గంధర్వమ్। ఆపో దదృశుషీః। తదృతే న్యావ్యాయన్। తదన్వవైత్। ఇన్ద్రోరారహాణ ఆసామ్। పరి సూర్యస్య పరిధీగ్ం రపశ్యత్।

ఓం భూర్భువస్సువః విశ్వావసు గంధర్వం అస్మిన్ దండే ఆవాహయామి స్థాపయామి పూజయామి।

ధ్యానమ్॥ విశ్వావసోత్ర గంధర్వ దండే రాత్రి త్రయం వసన్।

ఆవయోః ప్రీతి ముత్పాద్య రక్షాఽవాం శుభలక్షణ॥

అత్ర బ్రాహ్మణమ్ - గంధర్వో విశ్వావసుః పర్య ముష్టా త్సతిస్రో రాత్రీః పరిముషితో వస త్తస్మా త్తి స్రోరాత్రీః క్రీత స్సోమో వసతి తే దేవా అబ్రువన్ స్త్రీ కామావై గంధర్వా స్త్రియా నిష్క్రీణామేతి తే వాచగ్గ్ స్త్రియ మేకహాయ నీం కృత్వా తయా నిరక్రీణన్ సారోహిద్రూపం కృత్వా గంధర్వేభ్యః॥.

శ్లో॥ విశ్వావసుగంధర్వాయ నమః। ధ్యానావాహనాది
షోడశోపచార పూజాం కరిష్య ఇతి సంకల్ప్య పూజాం కుర్యాత్।

**ఇతి గంధర్వ స్థాపనమ్.**

# సదస్యమ్

ఆచమ్య...... ఏవం ప్రీత్యర్థం మమ వివాహమధ్యే మహదాశీర్వచన సమయే అష్టదిక్పాలక సహిత శ్రీమహాసరస్వతీ దేవతా ప్రీత్యర్థం

సరస్వతీపూజాం కరిష్యే। గణాధిపతి పూజాం కృత్వా ఏకస్మిన్ మంటపే మధ్యే సరస్వతీం ప్రణోదేవీ ఇతి మన్త్రేణావాహ్య, బ్రహ్మ జజ్ఞానమితి బ్రహ్మాణం చావాహ్య, ప్రాగాద్యష్ట దిక్షు దిక్పాలక మంత్రైః ఇంద్రాది దిక్పాలకానావాహ్య షోడశోపచార పూజాం కుర్యాత్। తతః వధూ వరాభ్యాం నూతన వస్త్రాణి, యథావిభవం రజిత పాత్రాణి చ దద్యాత్। అథ సభాయాం విద్యమానేభ్యః విద్వద్భ్యః ఏవం అర్చయేత్॥ యజమానః ఉత్థాయ పుష్పాక్షతాన్ గృహీత్వా।

సర్వేషాం మహా జనానాం శ్రీమహావిష్ణు స్వరూపాణాం బ్రాహ్మణానాం సర్వత్ర ఇమావ్యాసనాని। సర్వైర్దేవేక్షణః క్రియతామ్। ఓం తథా. (ప్రతివచనమ్)

ప్రాప్నువన్తు భవన్తః। ప్రాప్నువామ (ప్రతి వచనమ్) ఓం అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత। అర్చన్తు పుత్రకా ఉతపురన్న ధృష్ణ్వర్చత॥

అర్చత ప్రార్చత। గంధద్వారాం.. శ్రియం॥ ఆయనేతే...... గృహా ఇమే॥ పుష్పాక్షతాన్ సమర్ప్య। ఓం హిరణ్యరూప.. దత్యం నమస్మై॥

అత్ర వేదికా స్థితానేక విద్వత్సభా మహాజనేభ్యః బ్రహ్మశ్రీ...... శర్మా, బ్రహ్మశ్రీ ...... శర్మాచ వధూవరయోః వివాహ మహోత్సవం కుర్వన్తౌ సన్తౌ సదస్య మహదాశీర్వచన సమయే ఉపస్థిత విద్వత్తల్లజేభ్యః అనేక సువర్ణ పుష్పాణి సమర్పయతః। తతః, వేదాశీర్భిః, సాహిత్య గోష్ఠ్యా చ వధూవరయోః ఆశిషో దత్వా, ఆరార్తికం కృత్వా విద్వత్సన్మానం కృత్వా విరమేత్।

# కుల దేవతా పూజా

అత్ర సామ్ప్రదాయిక రూపేణ కుల దేవతా పూజాం కుర్యాత్। యథా గౌరీమిమాయేతి మంత్రేణ వధ్వాఃమాతా గౌరీ పూజాం కృత్వా, భర్తృ సోదర్యై వస్త్రాదికం దద్యాత్॥

# శేషహోమః

సూ॥ తం చతుర్థ్యాపర రాత్ర ఉత్తరాభ్యా ముత్థాప్య ప్రక్షాళ్య నిధాయ। ఓం ఉదీర్ష్వాతో విశ్వావసో నమసేడా మహేత్వా। అన్యామిచ్ఛ ప్రఫర్వ్యగ్ంం సంజాయాం పత్యాసృజ॥ ఉదీర్ష్వాతః పతివతి హ్యేషా విశ్వావసున్నమసా గీర్భిరీట్టే। అన్యామిచ్ఛ పితృషదం వ్యక్తాగ్ంం సతేభాగో జనుషా తస్య విద్ధి.

గంధర్వం ప్రక్షాళ్య, శయనా దన్యత్ర నిదధాతి। వధ్వాసహ ప్రాణానాయమ్య...... ఏవం ప్రీత్యర్థం వివాహ శేషహోమం కరిష్యే। ఉత్తరోవరః।

సూ॥ అగ్నేరుపసమాధానాద్యాజ్య భాగాంతేఽన్వారబ్ధాయా ముత్తరా ఆహుతీర్‌హుత్వా। ఏకమ్, ద్వే, త్రీణి, చత్వారి

1. ఓం అగ్నే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తిరసి బ్రాహ్మణస్త్వా నాథకామః ప్రపద్యే యాస్యాం పతిఘ్నీ తనూః ప్రజాఘ్నీ పశుఘ్నీ లక్ష్మీఘ్నీ జారఘ్నీ మస్యై తాం కృణోమి స్వాహా॥ అగ్నయే ప్రాయశ్చిత్తయ ఇదం నమమ॥

2. ఓం వాయో ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తం రసి బ్రాహ్మణస్త్వా నాథ కామః ప్రపద్యే యాస్యాం పతిఘ్నీ తనూః ప్రజాఘ్నీ పశుఘ్నీ లక్ష్మీఘ్నీ జారఘ్నీ మస్యైతాం కృణోమి స్వాహా॥ వాయవేప్రాయశ్చిత్తయ ఇదం నమమ॥

3. ఓం ఆదిత్య ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తిరసి బ్రాహ్మణస్త్వా నాథకామః ప్రపద్యే యాస్యాం పతిఘ్నీ తనూః ప్రజాఘ్నీ పశుఘ్నీ లక్ష్మీఘ్నీ జారఘ్నీ మస్యైతాం కృణోమి స్వాహా॥ ఆదిత్యాయ ప్రాయశ్చిత్తయ ఇదం నమమ॥

4. ఓం ప్రజాపతే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తిరసి బ్రాహ్మణ స్త్వా నాథకామః ప్రపద్యే యాస్యాం పతిఘ్నీ తనూః ప్రజాఘ్నీ పశుఘ్నీ లక్ష్మీఘ్నీ జారఘ్నీ మస్యైతాం కృణోమి స్వాహా॥ ప్రజాపతయే ప్రాయశ్చిత్తయ ఇదం నమమ॥

5. ఓం ప్రసవ శ్చోప యామశ్చ కాటశ్చార్ణవశ్చ ధర్ణశిశ్చ ద్రవిణంచ భగశ్చాంతరిక్షంచ సింధుశ్చ సముద్రశ్చ సరస్వాగ్శ్చ విశ్వవ్యచాశ్చ తేయం ద్విష్మో యశ్చనో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మ స్వాహా॥

ప్రసవాదిభ్యో దేవతాభ్య ఇదం నమమ॥

6. ఓం మధుశ్చ మాధవశ్చ శుక్రశ్చ శుచిశ్చ నభశ్చ నభస్య శ్చేషశ్చోర్జశ్చ సహశ్చ సహస్యశ్చ తపశ్చ తపస్యశ్చ తేయం ద్విష్మోయశ్చ

నోద్వేష్టి తమేషాంజమ్భే దధ్మ స్వాహా॥ మధ్వాదిభ్యో దేవతా భ్య ఇదం నమమ॥

7. ఓం చిత్తంచ చిత్తిశ్చాకూత్తం చాకూతిశ్చా ధీతం చా ధీతిశ్చ విజ్ఞాతంచ విజ్ఞానంచ నామచ క్రతుశ్చ దర్శశ్చ పూర్ణమాసశ్చ తేయం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మస్వాహా॥ చిత్తాదిభ్యో దేవతాభ్య ఇదం నమమ॥

ఇధ్మ సన్నహనాన్యద్భిసగ్గ్స్పృ శ్యాగ్నౌ ప్రహరతి।

జయాది ప్రతిపద్యతే...... అహం భో! అభివాదయే।

సూ – అపరేణాగ్నిం ప్రాచీముపవేశ్య, తస్యాశ్శిరస్యాజ్య శేషాత్ వ్యాహృతీభి రోంకార చతుర్థాభిరానీయ।

ఓం భూస్స్వాహా। ఓం భువస్స్వాహా। ఓం సువస్స్వాహా। ఓగ్ స్వాహా। సర్వేషామంతే సకృదానయతి। కేచిత్ప్రతి మన్త్రమ్।

సూ – ఉత్తరాభ్యాం యథాలింగం మిథస్సమీక్ష్య।

ఓం అపశ్యం త్వా మనసా చేకితానం తపసో జాతం తపసో విభూతమ్। ఇహ ప్రజా మిహ రయిగ్ం రరాణః ప్రజాయస్వ ప్రజయా పుత్ర కామ। ఇతివధూర్వర మీక్షేత। ఓం అపశ్యం త్వా మనసాదీధ్యానాగ్స్వాయాం తనూగ్ం ఋత్వియే నాథమానామ్। ఉపమా ముచ్చాయువతిర్బభూయాః ప్రజాయస్వ ప్రజయా పుత్రకామే। ఇతి వరో వధూమీక్షేత।

సూ - ఉత్తరయాఽఽజ్యశేషేణ హృదయదేశౌ సంమృజ్య। ఓం సమంజంతు విశ్వేదేవా స్సమాపో హృదయాని నౌ। సంమాతరిశ్వా సంధాతా సముదేష్ట్రీ దిదేష్టునౌ॥

సూ - ఉత్తరాస్త్రిస్రోజపిత్వా। (సకృదేవ మంత్రః) ఓం ప్రజాపతే తన్వంమే జుషస్వ త్వష్ట ర్దేవేభిస్సహసా మ ఇన్ద్ర। విశ్వైర్దేవైరాతిభి స్సగ్ం రరాణః పుగ్ంసాం బహూనాం మాతర స్స్యామ॥

ఆనః ప్రజాం జనయతు ప్రజాపతి రాజరసాయ సమనక్త్వర్యమా। అదుర్మంగలీః పతిలోక మావిశ శన్నోభవ ద్విపదే శం చతుష్పదే।

తాం పూషన్ ఛివతమా మేరయస్వ యస్యాం బీజం మనుష్యా వపన్తి। యాన ఊరూ ఉశతీ విస్రయాతై యస్యాముశంతః ప్రహరేమ శేఫమ్॥

సూ - శేషగ్ం సమావేశనే జపేత్। అన్యోవైనామభి మన్త్రయేత।

ఆచమ్య...... ఏవం ప్రీత్యర్థం (శేషహోమాంగ) సమావేశనం కరిష్యే। ఉత్తరోవరః

ఆరోహోరు ముపబర్హస్వ బాహుం పరిష్వజస్వ జాయాగ్ం సుమనస్యమానః। తస్యాం పుష్యతం మిథునౌ సయోనీ బహ్వీం ప్రజాం జనయన్తౌ సరేతసా। ఆర్ద్రయాఽఽరణ్యా యత్రామన్థత్పురుషం పురుషేణ శక్రః। తదేతౌ మిథునౌ సయోనీ ప్రజయాఽఽ మృతేనేహ గచ్ఛతమ్।

అహం గర్భ మదధా మోషధీష్వహం విశ్వేషు భువనేష్వన్తః। అహం ప్రజా అజనయం పితౄణా మహం జనిభ్యో అవరీషు పుత్రాన్। పుత్రిణే మా కుమారిణా విశ్వమాయు ర్వ్యశ్నుతమ్।

ఉభా హిరణ్యపేశసా వీతిహోత్రా కృతద్వసూ। దశస్యం త్వాఽమృతాయకగ్ం శమూధో రోమ శగ్ంహథో దేవేషు కృణుతో దువః।

వధూముత్తరతోపవేశ్య। సమావేశన ముహూర్తః సుముహూర్తో అస్తు। శ్లో॥ ఫలం మనోరథ ఫలం పుత్ర పౌత్ర ప్రవర్ధనమ్। యస్మాత్తస్మాచ్ఛివం మేస్యాదత శ్శాంతిం ప్రయచ్ఛమే॥ ఫల ప్రదానం తుభ్యమహం సంప్రదదే నమమ।

తతః కంకణ విమోచనం కుర్యాత్.

కంకతో నకంకతోథో సతీ న **కంకతః। ద్వావితి ప్లుషీ ఇతిన్యా** అదృష్టా అలిప్సత। శ్లో॥కంకణం మోచయామ్యేవ రక్షాస్మి న్నకదాచన। మయి రక్షాం స్థిరాం బధ్వా దేశత్వం గచ్ఛ కంకణ॥

లోకాచారాత్ వధూగృహప్రవేశానంతరం వరగృహే ఏవ కంకణ మోచనం కుర్వన్తి। పరంతు॥ చతుర్థ్యాం నిశిమోచయేదితి వచనాత్, దీక్షానంతరం శేష హోమాన్తే విసర్జయేదితి శాస్త్ర సమ్మతః పారః॥

తతః పంచమేహ్ని ప్రాతః వధూవరయోః అభ్యంగన స్నానాదికం కారయిత్వా, ప్రాతరౌపాసనం కృత్వా, దీక్షావస్త్రాణి జలే సంశోధ్య (ఆర్ద్రీ కృత్య) అవధూయ సాయమౌపాసనానంతరం నాకబలిం కుర్యాత్.

* * * * * *

ఆవృశ్చతి తాజగార్తి మార్చత్యుత్తరా నాకసద్మ్య ఉపదధాతి యథా జాయామానీయ గృహేషు నిషాదయతి తాదృగేవతత్ ।

పశ్చాత్ప్రాచీ ముత్తమా ముపదధాతి తస్మాత్పశ్చా త్ప్రాచీ పత్న్యన్వాస్తే స్వయమాతృణ్ణాంచ వికర్ణీం చోత్తమే ఉపదధాతి ప్రాణో వై స్వయమాతృణ్ణాఽఽ యుర్వికర్ణీ ప్రాణం చైవాయుశ్చ ప్రాణానా ముత్తమౌ ధత్తే తస్మాత్ప్రాణశ్చా యుశ్చ ప్రాణానా ముత్తమౌ నాన్యాముత్తరా మిష్టకా ముపదధ్యాద్యదన్యా ముత్తరా మిష్టకా ముపదధ్యాత్పశూనామ్ ।

చ యజమానస్య చ ప్రాణం చాయుశ్చా పిదధ్యాత్తస్మాన్నాన్యోత్తరేష్టకో పధేయా స్వయమాతృణ్ణా ముపదధాత్యసౌవై స్వయమాతృణ్ణాఽమూమేవోప ధత్తేఽశ్వముప ఘ్రాపయతి ప్రాణమేవాస్యాం దధాత్యథో ప్రాజాపత్యోవా అశ్వః ప్రజాపతి నైవాగ్నిం చినుతే స్వయమాతృణ్ణా భవతి ప్రాణానా ముత్సృష్ట్యా అథో సువర్గస్య లోకస్యాను ఖ్యాత్యా ఏషావై దేవానాం విక్రాన్తి ర్యద్వికర్ణీ యద్వికర్ణీ ముపదధాతి దేవానామేవ విక్రాన్తి మను విక్రమత ఉత్తరత ఉపదధాతి తస్మాదుత్తరత ఉపచారోఽగ్నిర్వాయుమతీ భవతి సమిద్ధ్యై ॥ సంభృత్తం యన్నాకసదో యన్నాకసద స్తత్పశూనామేషావై ద్వావిగ్ంశతిశ్చ ॥ సిగ్ంహే వ్యాఘ్ర ఉతయా పృదాకౌ । త్విషి రగ్నౌ బ్రాహ్మణే సూర్యేయా । ఇంద్రం యా దేవీ సుభగా జజాన । సాన అగన్

వర్చసా సంవిదానా ॥ యా రాజన్యే దుందుభా వాయతాయాం । అశ్వస్యక్రన్దే పురుషస్య మాయౌ । ఇన్ద్రం యా దేవీ.... విదానా ॥ యాహస్తిని ద్వీపిని యా హిరణ్యే । త్విషి రశ్వేషు పురుషేషు గోషు ॥1॥

ఇన్ద్రం యా దేవీ.....విదానా ॥ రథే అక్షేషు వృషభస్య వాజే । వాతే పర్జన్యే వరుణస్య శుష్మే । ఇన్ద్రం.....విదానా ॥ రాడసి విరాడసి । సమ్రాడసి స్వరాడసి । ఇన్ద్రాయత్వా తేజస్వతే తేజస్వన్తగ్గ్ శ్రీణామి । ఇంద్రాయ త్వౌజస్వత ఓజస్వన్తగ్గ్ శ్రీణామి ॥2॥

ఇంద్రాయత్వా పయస్వతే పయస్వన్తగ్గ్ శ్రీణామి । ఇంద్రాయత్వాఽయుష్మత ఆయుష్మన్తగ్గ్ శ్రీణామి । తేజోసి । తత్తే ప్రయచ్ఛామి । తేజస్వదస్తుమే ముఖం । తేజస్వచ్ఛిరో అస్తుమే । తేజస్వాన్ విశ్వతః ప్రత్యఙ్గ్ । తేజసా సంపిపృగ్ధిమా । ఓజోసి ॥3॥

తత్తే ప్రయచ్ఛామి । ఓజస్వదస్తు మే ముఖం । ఓజస్వచ్ఛిరో అస్తుమే । ఓజస్వాన్ విశ్వతః ప్రతఙ్గ్ । ఓజసా సంపిపృగ్ధిమా । పయోసి । తత్తే ప్రయచ్ఛామి । పయస్వదస్తు మే ముఖం । పయస్వచ్ఛిరో అస్తుమే । పయస్వాన్ విశ్వతః ప్రత్యఙ్గ్ । పయసా సంపృగ్ధిమా ॥4॥

ఆయురసి । తత్తే ప్రయచ్ఛామి । ఆయుష్మదస్తు మే ముఖం । ఆయుష్మచ్ఛిరో అస్తుమే । ...... సంపిపృగ్ధిమా । ఇమమగ్న ఆయుషే

వర్చసేకృధి । ప్రియగ్ంరేతో వరుణ సోమరాజన్ । మాతేవాస్మా అదితే శర్మయచ్ఛ । విశ్వేదేవా జరదష్టిర్యథాసత్ ॥5॥

ఆయురసి విశ్వాయురసి । సర్వాయురసి సర్వమాయురసి । యతోవాతో మనో జవాః । యతః క్షరన్తి సిన్ధవః । తాసాంత్వా సర్వాసాగ్ం రుచా । అభిషించామి వర్చసా । సముద్ర ఇవాసి గహ్మనా । సోమ ఇవాస్యదాభ్యః । అగ్నిరివ విశ్వతః ప్రత్యఙ్ । సూర్య ఇవ జ్యోతిషావిభూః ॥6॥

అపాంయో ద్రవణే రసః । తమహమస్మా ఆముష్యాయణాయ । తేజసే బ్రహ్మ వర్చసాయ గృహ్ణామి । అపాంయ ఊర్మౌరసః । తమహమస్మా ఆముష్యాయణాయ । ఓజసే వీర్యాయ గృహ్ణామి । అపాం యో మధ్యతో రసః । తమహమస్మా ఆముష్యాయణాయ । పుష్ట్యై ప్రజననాయ గృహ్ణామి । అపాం యో యజ్ఞియోరసః । తమహ మస్మా ఆముష్యాయణాయ । ఆయుషే దీర్ఘాయుత్వాయ గృహ్ణామి ॥7॥

గోష్ఠోజస్వన్తగ్గ్ శ్రీణామ్యోజోసి తత్తే ప్రయచ్ఛామి పయసా సంపిపృగ్ధిమా సద్విభూర్యజ్ఞి యోరసోద్వేచ ।

అగ్నిర్దేవతా వాతో దేవతా సూర్యో దేవతా చన్ద్రమా దేవతా వసవో దేవతా రుద్రాదేవతాఽదిత్యా దేవతా విశ్వే దేవా దేవతా మరుతో దేవతా బృహస్పతిర్దేవతేంద్రో దేవతా వరుణో దేవతా మూర్ధాసిరాడ్ ధ్రువాసి ధరుణా

యంత్ర్యసి యమిత్రీ షేత్వో ర్జేత్వా కృష్యైత్వా క్షేమాయత్వా యంత్రీరాడ్ ధృవాసి ధరణీ ధర్త్ర్యసి ధరిత్ర్యాయుషే త్వా వర్చసే త్వౌజసే త్వా బలాయ త్వా । ప్రాచీతిష్ఠత్వా దధతి । తేన ప్రాచీం దిశం జయతి । ప్రాగ్దిగ్భాగే ఇంద్రో దేవతా । ఇంద్ర ప్రసాదాద్విజ యాయ । తం దక్షిణా పరివహంతి। తేన దక్షిణాం దిశం జయతి । దక్షిణ దిగ్భాగే యమో దేవతా । యమ ప్రసాదాద్విజయాయ । తం ప్రత్యంచ మావర్తయంతి । తేన ప్రతీచీం దిశం జయతి । ప్రతీచీ దిగ్భాగే వరుణో దేవతా । వరుణ ప్రసాదాద్విజయాయ । తముదీచీ తిష్ఠంత ఉపావహన్తి । తేనోదీచీం దిశం జయతి । ఉదీచీ దిగ్భాగే కుబేరో దేవతా । కుబేర ప్రసాదాద్విజయాయ । సోమేన రాజ్ఞా సర్వాదిశో జయతి । య ఏవం వేద । ఇత్యనువాకై స్త్రయస్త్రింశద్దీపైః ప్రదక్షిణీ కుర్యుః । ప్రాగాది దిక్షు దీపాన్ నిధాయ । అవసరనైవేద్యం కృత్వా తంతూ నుద్వాస్య । పుష్కరం ప్రవిశ్య చతుర్దిక్షు నాకబలి దేవతాభ్యో నమః । ఇతి బలిముదక పురస్సరం విసృజేత్ । దంపతీ చిత్ర వస్త్రాదికం ధృత్వా । దక్షిణ గజస్యోపరి వధూం స్థాపయిత్వా । వర ఉత్తర గజమధిరుహ్యా । ఇంద్రాయ రాజ్ఞే సూకరో వరుణాయ రాజ్ఞే కృష్ణో యమాయ రాజ్ఞ ఋశ్య ఋషభాయ రాజ్ఞే గవయశ్శార్దూలాయ రాజ్ఞే గౌరః పురుష రాజాయ మర్కటః । క్షిప్రశ్యేనస్య వర్తికా నీలంగోః క్రిమి స్సోమస్య రాజ్ఞః కులుంగ స్సిన్ధో శ్శిగ్ంం శుమారో హిమవతో హస్తి ॥

ఉపవిశ్య ప్రాణానాయమ్య...... ప్రీత్యర్థం

నాకబలికర్మాం గత్వేన కర్మణః పుణ్యాహం వాచయిష్యే । కృత్వా-

ఏవం.... ప్రీత్యర్థం ఆవయోః సాగ్ర శతవర్ష సుఖజీవన సిద్ధ్యర్థం, అన్యోన్య ప్రీత్యర్థం దీర్ఘసౌమంగల్య సిద్ధ్యర్థం నీలలోహిత గౌరీ ప్రీత్యర్థం నీలలోహిత గౌరీ పూజాం కరిష్యే । కృత్వా ।

నీలలోహితే........బధ్యతే ॥

నీలలోహిత ధారణముహూర్త స్సుముహూర్తో అస్తు ।

(ఏవం.... ప్రీత్యర్థం అనయా నవోఢయా వధ్వాసహ అయుష్యాభి వృధ్యర్థం గర్భాధానాఖ్యం కర్మ కరిష్యే । ఉత్తరోవరః । విష్ణుర్యోనిం....... సమర్ధయ ॥ వధూముత్తరతోపవేశ్య గర్భాధాన ముహూర్తస్సుముహూర్తోస్తు । సత్సంతాన సౌభాగ్య సకల ఫలావాప్త్యర్థం ఫలప్రదానాని కరిష్యే ॥

యా ఫలినీర్యా....... హసః ।)

। ఇంద్రాణీం ప్రార్థయేత్ ।

శ్లో॥ దేవీంద్రాణి నమస్తుభ్యం దేవేంద్ర ప్రియభామినీ ।
వివాహోద్భాగ్య మారోగ్యం పుత్ర పౌత్రాంశ్చ దేహిమే ॥

శ్లో॥ వంశ పాత్రమిదం దానం వంశానాం వంశవర్ధనం ।
వంశస్య దీయతే దానం అతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

శూర్పవాయనం తుభ్యమహం సంప్రదదే నమమ । వసంత పూరిత పూర్ణజల పాత్రే కంకణ తాటంకైర్వధూవరౌ విలాసార్థం జూదం కుర్యాత్.

ఏవం.... ప్రీత్యర్థం వసంత మాధవ పూజాం కరిష్యే ।

వసంత మాధవ దేవతాభ్యో నమః షోడశోపచార పూజాం సమర్పయామి ।

మం: వసంతే నర్తునాదేవాః । వసవస్త్రివృతాస్తుతం । రథన్తరేణ తేజసా । హవిరిన్ద్రే వయోదధుః । గ్రీష్మేణ దేవా ఋతునా । రుద్రాః పంచదశేస్తుతం । బృహతా యశసా బలం । హవిరింద్రే వయోదధుః । వర్షాభిర్ ఋతునాదిత్యాః । స్తోమే సప్తదశేస్తుతం । వైరూపేణ విశౌజసా । హవిరింద్రే వయోదధుః । శారదే నర్తునా దేవాః । ఏకవిగ్ంశ ఋభవస్తుతం । వైరాజేన శ్రియాశ్రియం । హవిరింద్రేవయోదధుః । హేమంతే నర్తునాదేవాః । మరుత స్త్రిణవే స్తుతం । బలేన శక్వరీ స్సహః । హవిరింద్రేవయోదధుః । శైశిరేణర్తునా దేవాః । త్రయస్త్రిగ్ంశే మృతగ్గ్స్తుతం । సత్యేన రేవతీఃక్షత్రం । హవిరింద్రే వయోదధుః ।

దేవస్యత్వా............ నాభిషించామి ।

తతః కంకణ విమోచనం కుర్యాత్

కంకతో....... అలిప్సత ॥

శ్లో॥ కంకణం మోచయామ్యేవ రక్షాస్మిన్న కదాచన ।
మయి రక్షాం స్థిరాం బద్ధ్వా దేవత్వం గచ్ఛ కంకణ ॥

బంధుభ్యో మిథునేభ్యస్తాంబూలాని దత్వా విప్రైరాశీర్వచనం ప్రాప్య బంధుభిః స్సహ భుంజీతేత్యాహ భగవాన్ బోధాయనః ॥

* * * * * *

# అగ్నినష్టప్రాయశ్చిత్త ప్రయోగః

ఉపాయనాగ్నౌచ వివాహవహ్నౌ శావానలే సూతక పావకేచ । శాన్తే హృతే చోపహతేచ నష్టే శన్నోదేవీత్యద్భిరవోక్ష్య భస్మ ॥ తస్మిన్నసమారోప్య సమిధ్యయన్తే ఆజుహ్వానోద్బుధ్య పదద్వయేన । లౌక్యానలే తాం సమిధం ప్రహృత్య దద్యాద్వరం కాంచన మేవ మౌల్యం । అయాశ్చ పంచహోతా బ్రాహ్మణ ఏక హోతాదశ। మనస్వతీచ మిందాచ మహావ్యాహృతయస్తథా । అనాజ్ఞాత త్రయం చాఽథ వ్యాహృతిః ప్రణవాదికాః । వారుణ్యా స్తంతుమత్యశ్చ తథా తన్త్రం ప్రయోజయేత్ ।

ఆచమ్య......ఏవం ప్రీత్యర్థం మమ, (దంపత్యోః) ఉత్తరోత్తర కర్మాధికార సిధ్యర్థం, ఉపనయన (వివాహ) అగ్నినష్టప్రాయశ్చిత్తం కరిష్యే । అపహతా అసురా శ్శన్నోదేవీరితి ద్వాభ్యాం తద్భస్మాద్భిరవోక్ష్య । అపహతా అసురా ర క్షాగ్ంసి పిశాచా యే క్షయన్తి పృథివీ మను । అన్యత్రేతో గచ్ఛన్తు యత్రైషాం గతం మనః ॥ శన్నోదేవీ రభిష్టయ ఆపో భవన్తు పీతయే । శంయోరభిస్ర వంతునః । అయంతేయోనిర్‌ఋత్వియ ఇతి యజ్ఞియ సమిధం తద్భస్మని సమారోప్య।

అయన్తే యోనిర్‌ఋత్వియో యతోజాతో అరోచథాః । తంజానన్నగ్న ఆరోహాథానో వర్ధయా రయిమ్ । శ్రోత్రియాగారాదగ్ని మాహృత్య । స్థండిలే భూర్భువస్సువరోమితి అగ్నింప్రతిష్ఠాప్య । భూర్భువస్సువరోమ్ । ఆజుహ్వాన ఉద్బుధ్యస్వేతి ద్వాభ్యాం తస్మిన్నగ్నౌ తాం సమిధం నిక్షిప్య ।

ఆజుహ్వాన స్సుప్రతీకః పురస్తాదగ్నే స్వాం యోని మాసీద సాధ్యా । అస్మిన్సధస్థే అధ్యుత్త రస్మిన్ విశ్వేదేవా యజమాన శ్చ సీదత । ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహ్యేన మిష్టాపూర్తే సగ్ం సృజేథామయంచ । పునః కృణ్వగ్ స్త్వా పితరం యువాన మన్వా తాగ్ం స్త్వయి తన్తు మేతమ్ ॥ అత్రవరం దద్యాత్ । వరశబ్దేన ధేనురుచ్యతే । ఏతత్కర్మ సమృధ్యర్థం ధేనుదానం శ్రీమహావిష్ణు ప్రీతిం కామయమాన స్తుభ్యమహం సంప్రదదే నమమ ।

తతః చత్వారి శృంగేత్యాది అలంకరణాన్తంకృత్వా పరిస్తీర్య, చతుష్పాత్ర ప్రయోగాది ఆజ్య సంస్కారాన్తే అగ్నిం పరిషిచ్య । స్రువేణ చతుర్గృహీత మాజ్యం స్రుచి గృహీత్వాన్వారబ్ధాయామ్ । అయాశ్చేత్యాది ద్వాత్రింశదాజ్యాహుతీః జుహుయాత్ ।

(1) అయాశ్చాగ్నేస్య...స్వాహా । అయసేஉగ్నయఇదం॥

(2) మం॥అగ్నిర్హోతా । అశ్వినాధ్వర్యూ । త్వష్టాగ్నిత్ । మిత్రఉపవక్తా । సోమస్సోమస్య పురోగాః । శుక్ర శ్శుక్రస్యపురోగాః । శ్రాతాస్త ఇన్ద్రసోమాః । వాతాపేర్హవన శ్రుత స్వాహా ॥ అగ్నయే పఞ్చహోత్రఇదం నమమ ।

(3) బ్రాహ్మణ ఏక హోతా । సయజ్ఞః ।సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః । యజ్ఞశ్చమే భూయాత్స్వాహా । బ్రహ్మణ ఏకహోత్రఇదం

।(4) అగ్నిర్ద్విహోతా । సభర్తా । సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః ।

భర్తాచమే భూయాత్స్వాహా ॥ అగ్నయే ద్విహోత్ర ఇదం ॥

(5) పృథివీ త్రిహోతా । సప్రతిష్ఠా । సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః । ప్రతిష్ఠాచ మే భూయాత్స్వాహా ॥ పృథివ్యై త్రిహోత్ర ఇదం ॥

(6) అన్తరిక్షం చతుర్హోతా । సవిష్ఠాః । సమేద దాతు ప్రజాం పశూన్ పుష్టింయశః । విష్ఠాశ్చమే భూయాత్స్వాహా ॥ అన్తరిక్షాయ చతుర్హోత్ర ఇదం ॥

(7) వాయుః పంచహోతా । స ప్రాణః । సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టింయశః । ప్రాణశ్చమే భూయాత్స్వాహా ॥ వాయవే పంచహోత్రఇదంనమమ॥

(8) చన్ద్రమాష్షడ్ఢోతా । సఋతూన్; కల్పయాతి । సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టింయ శః । ఋతవశ్చమే కల్పన్తాగ్ స్వాహా । చన్ద్రమసేషడ్ఢోత్ర ఇదమ్ ॥

(9) అన్నగ్ం సప్తహోతా । సప్రాణస్య ప్రాణః । సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః । ప్రాణస్యచమే ప్రాణో భూయా త్స్వాహా ॥ అన్నాయ సప్తహోత్ర ఇదం నమమ ।

(10) ద్యౌరష్టహోతా । సోనాధృష్యః । సమేదదాతుప్రజాం పశూన్ పుష్టిం యశః । అనాధృష్యశ్చ భూయా సగ్గ్స్వాహా ॥ దివే అష్టహోత్ర ఇదం నమమ ।

(11) ఆదిత్యో నవహోతా । స తేజస్వీ । సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః । తేజస్వీచ భూయాసగ్గ్ స్వాహా ॥ ఆదిత్యాయ నవహోత్ర ఇదం

(12) ప్రజాపతిర్దశహోతా । స ఇదగ్ం సర్వమ్ । సమే దదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః । సర్వంచమే భూయాత్స్వాహా ॥ ప్రజాపతయే దశహోత్ర ఇదమ్ నమమ ॥

(13) మనోజ్యోతిః.......స్వాహా । మనసేజ్యోతిషఇదం ॥

(14) యన్మఆత్మనో........స్వాహా । మిన్దాదిభ్యోదేవతాభ్య ఇదంనమమ ।

(15) పునర్గ్నిః.....స్వాహా । అగ్నీన్ద్ర బృహస్పత్యశ్విభ్య ఇదంనమమ ॥

(16) భూరగ్నయేచ పృథివ్యై చ మహతే చస్వాహా । అగ్నయే పృథివ్యై మహత ఇదం నమమ ॥

(17) భువోవాయవే చాన్తరిక్షాయచ మహతేచ స్వాహా । వాయవే అన్తరిక్షాయమహత ఇదం నమమ ॥

(18) సువరాదిత్యాయచ దివేచ మహతేచ స్వాహా । ఆదిత్యాయ దివే మహతఇదం నమమ ॥

(19) భూర్భువస్సువ శ్చన్ద్రమసేచ నక్షత్రేభ్యశ్చ దిగ్భ్యశ్చ మహతేచస్వాహా । చన్ద్రమసే నక్షత్రేభ్యో దిగ్భ్యో మహత ఇదంనమమ॥

(20) అనాజ్ఞాతం......స్వాహా । అయసే అగ్నయఇదం ॥

(21) పురుషసమ్మితో....స్వాహా । అగ్నయఇదం ॥

(22) యత్పాకత్రా.....స్వాహా । అగ్నయఇదం॥

(23) ఓం భూ స్వాహా । అగ్నయఇదం॥

(24) ఓం భువ స్వాహా । వాయవఇదం ॥

(25) ఓం సువ స్వాహా । సూర్యాయేదం ॥

(26) ఓం భూర్భువస్సువస్వాహా । ప్రజాపతయఇదం నమమ ॥

(27) ఇమంమే....స్వాహా । వరుణా యేదం ॥

(28) తత్వాయామి.....స్వాహా । వరుణా యేదం॥

(29) ఉదుత్తమం వరుణ పాశ మస్మ దవాధమం విమధ్య మగ్గ్రశ్రధాయ । అథావయ మాదిత్య వ్రతే తవానాగస్తో అదితయేస్యామస్వాహా । వరుణాయాదిత్యా యేదం ॥

(30) త్రయస్త్రిగ్ం శత్తం తవో యేవి తత్నిరే । యఇమం యజ్ఞగ్గ్ స్వధయా దదన్తే తేషాం ఛిన్నం ప్రత్యేతద్దధామి స్వాహా ఘర్మో దేవాగ్ం అప్యేతుస్వాహా । అగ్నయే తన్తుమతఇదమ్ ॥

(31) తన్తుంతన్వన్రజసో భానుమన్విహి జ్యోతిష్మతః పథోరక్ష ధియాకృతాన్। అనుల్బణం వయత జోగువామపో మనుర్భవ జనయా దైవ్యం జనగ్గ్ స్వాహా । అగ్నయే తన్తుమత ఇదమ్ నమమ ॥

(32) ఉద్బుధ్యస్వాగ్నే....స్వాహా । అగ్నయే తన్తుమత ఇదమ్ నమమ ॥

(33) సర్వప్రాయశ్చిత్తం కరిష్యే – ఓంభూర్భువస్సువస్వాహా ప్రజాపతయ ఇదం......

ఓం అదితేన్వ మగ్గ్స్థాః ।

ఓం అనుమతేన్వ మగ్గ్స్థాః ।

ఓం సరస్వతే న్వమగ్గ్స్థాః ।

ఓం దేవసవితః ప్రాసావీః ।

అనేన అగ్నినష్ట ప్రాయశ్చిత్త హోమేన భగవాన్ సర్వాత్మకః శ్రీమహావిష్ణు స్సుప్రీణాతు.

తతః కర్మశేషం సమాపయేత్

* * * * * *

# రుద్రోవా ఏష అనువాకః

రుద్రో వా ఏషః । యదగ్నిః । పత్నీస్థాలీ । యన్మధ్యేఽగ్నేరధి శ్రయేత్ । రుద్రాయ పత్నీమపి దధ్యాత్ । ప్రమాయుకాస్యాత్ । ఉదీచోఽఙ్గారాన్ని రూహ్యాధి శ్రయతి । పత్నియై గోపీథాయ । వ్యన్తాన్కరోతి । తథా పత్న్య ప్రమాయుకా భవతి ॥౧౧॥

ఘర్మో వా ఏషోఽశాన్తః । అహరహః ప్రవృజ్యతే । యదగ్నిహోత్రమ్ । ప్రతిషిఞ్చే త్పశుకామస్య । శాన్తమివ హి పశవ్యమ్ । న ప్రతిషిఞ్చే

ద్బ్రహ్మవర్చస కామస్య । సమిద్ధమివ హి బ్రహ్మవర్చసమ్ । అథో ఖలు । ప్రతి షిచ్యమేవ । యత్ప్రతిషిఞ్చతి ॥౧౨॥

తత్ప్రశవ్యమ్ । యజ్జుహోతి । తద్బ్రహ్మవర్చసి । ఉభయమేవాకః । ప్రచ్యుతంవా ఏతదస్మాల్లోకాత్ । అగతన్దేవలోకమ్ । యచ్ఛృతగ్ం హవిరనభిఘారితమ్ । అభి ద్యోతయతి । అభ్యేవైనద్ఘారయతి । అథో దేవత్రైవైనద్గమయతి ॥౧౩॥

పర్యగ్ని కరోతి । రక్షసామపహత్యై । త్రిః పర్యగ్ని కరోతి । త్ర్యావృద్ధి యజ్ఞః । అథో మేధ్యత్వాయ । యత్ప్రాచీనముద్వాసయేత్ । యజమానగ్ం శుచాఽర్పయేత్ । యద్దక్షిణా । పితృదేవత్యగ్గ్ స్యాత్ । యత్ప్రత్యక్ ॥౧౪॥

పత్నీగ్ం శుచార్పయేత్ । ఉదీచీన ముద్వాసయతి । ఏషావైదేవ మనుష్యాణాగ్ం శాన్తాదిక్ । తామేవైనదనూద్వాసయతి శాన్త్యై । వర్త్మ కరోతి । యజ్ఞస్య సన్తత్యై । నిష్టపతి । ఉప్రైవ తత్ స్తృణాతి । చతురున్నయతి । చతుష్పాదః పశవః ॥౧౫॥

పశూనేవావ రున్ధే । సర్వాన్పూర్ణా మున్నయతి । సర్వే హి పుణ్యారాద్ధాః । అనూచ ఉన్నయతి । ప్రజాయా అనూచీనత్వాయ । అనూచ్యేవాస్య ప్రజాఽర్ధుకా భవతి । సం మృశతి వ్యావృత్త్యై । నాహోష్యన్నుప సాదయేత్

। యదహోష్యన్నుప సాదయేత్ । యథాఽన్యస్మా ఉపనిధాయ ॥౧౬॥

అన్యస్మై ప్రయచ్ఛతి । తాదృగేవ తత్ । ఆఽస్మై వృశ్చ్యేత । యదేవ గార్ హపత్యేఽధి శ్రయతి । తేన గార్ హపత్యం ప్రీణాతి । అగ్నిరభిభేత్ । అహుతయో మాఽత్యేష్యన్తీతి। స ఏతాగ్ం సమిధమపశ్యత్ । తామాఽధత్త । తతోవా అగ్నా వాహుతయోఽధ్రియన్త ॥౧౭॥

యదేనగ్ం సమయచ్ఛత్ । తత్సమిధస్సమిత్త్వమ్। సమిధమా దధాతి । సమేవైనం యచ్ఛతి । ఆహుతీనాన్ధృత్యై । అథో అగ్ని హోత్రమేవేధ్మ వత్కరోతి । ఆహుతీనాం ప్రతిష్ఠిత్యై । బ్రహ్మవాదినో వదన్తి । యదేకాగ్ం సమిధమాధాయద్వే ఆహుతీ జుహోతి । అథ కస్యాగ్ం సమిధి ద్వితీయా మాహుతిఞ్జుహోతీతి ॥౧౮॥

యద్వే సమిధావాదధ్యాత్ । భ్రాతృవ్యమస్మై జనయేత్ । ఏకాగ్ం సమిధమాధాయ । యజుషాఽన్యామాహుతింజుహోతి । ఉభే ఏవ సమిద్వతీ ఆహుతీ జుహోతి । నాస్మై భ్రాతృవ్యఞ్జనయతి । ఆదీప్తాఽయాఞ్జుహోతి । సమిద్ధమివ హి బ్రహ్మవర్చసమ్ । అథో యథాఽతిథిఞ్జ్యోతిష్కృత్వా పరి వేవేష్టి । తాదృగేవ తత్ । చతురున్నయంతి । ద్విర్జుహోతి । తస్మాద్ద్విపాచ్చతుష్పాదమత్తి । అథోద్విపద్యేవ చతుష్పదః ప్రతిష్ఠాపయతి ॥౧౯ ॥

భవతి ప్రతిష్ఠిత్యతి గమయతి ప్రత్యక్షమేవ ఉపనిధాయా ధ్రియ
న్తేతి తచ్చత్వారిచ ॥ ॥ తై-బ్రా-౨-౧-౩

* * * * * *

# ఉపనయన మంగళ శ్లోకాః

(1)శ్లో॥ యస్సోమకం జిత్య సమస్తవేదాన్ దదౌ విధాత్రే ప్రథమావతారః।
మత్స్యావతారో మధుహాసవిష్ణుర్వటుం చతుర్వేదపటుం కరోతు ॥

(2) శ్లో॥ సురాఽసురార్థం జలధౌ పురాయో పృష్ఠే ధరన్మందర
శైలభారః। విశ్వంభర శ్రీకమఠావతారో వటుం......

(3) శ్లో॥ యజ్ఞేశ్వరో యజ్ఞ వరాహరూపీ యశ్శుక్ర శిష్యానజ
యచ్చయుద్ధే। దంష్ట్రాగ్రకోటీవిధృతావనిర్యో వటుం......

(4) శ్లో॥ సురాసురై స్సేవిత పాద పద్మః స్తంభోద్భవ శ్రీ నరసింహ
రూపః। ప్రహ్లాద వాక్యైః ప్రథితా వనిర్యో వటుం.....

(5) శ్లో॥ కృష్ణాజినం దండకమండలుంచ ఛత్రం పవిత్రం
ధృతవిశ్వమూర్తిః। సవామన స్సర్వసురైకసేవ్యో వటుం......

(6) శ్లో॥ కుఠార కోదండ ధరశ్చ శూరః ప్రతాపవాన్బ్రహ్మకుల
ప్రదీపః। సజామదగ్న్యో భువనైకవీరో వటుం....

(7) శ్లో॥ సాకేత నాథోర్క కుల ప్రదీప స్సీతాననాంభోరుహ
చంచరీకః। శ్రీరామచంద్ర శ్రితపారిజాతో వటుం......

(8) శ్లో॥ కృష్ణాగ్రజో వృష్ణికుల ప్రదీపః తారాధిపః క్షీర
పయోధివర్ణః । హలాయుధ శ్రీబలభద్రరామో వటుం.....

(9) శ్లో॥ శ్రీకృష్ణ దేవశ్రిత పారిజాతః శ్రీవక్ర పద్మాళిరనంత
వీర్యః । శ్రీమాన్ జగద్రక్షణ కార్యవృత్తో వటుం.....

(10) శ్లో॥ మాయావటుః పిప్పలమూల సంస్థో నిశాచర స్త్రీవ్రత
భంగకారీ । బుద్ధావతారో బహుసిద్ధసేవ్యో వటుం......

(11) శ్లో॥ తురంగ వాహస్తుముల ప్రవర్తీ తృతీయ మూర్తి స్పృ
టితారి వర్గః । కల్క్యవతారః కలుషాపహారీ వటుం.....

(12) శ్లో॥ బోద్ధాభిధానో భగవాన్ పరేశః ప్రజ్ఞానవాన్ మౌని
నిశాంత వాసః । శ్రీమజ్జగన్నాథపురాధినాథో వటుం...

* * * * * *

(1) ఆదౌ గణేశ స్తదను స్వయంభూస్తతో గిరీశస్తదనంతరం హరిః ।
ఏతే సదా దేవగణా దిశన్తు వటోశ్చిరాయు శ్శుభకీర్తి విద్యాః ॥

(2) సుమేరు సౌరత్న గిరీంద్రనీల కైలాస విన్ధ్యాచల హేమకూటాః ।
సర్వేగిరీంద్రా స్సతతం దిశంతు వటోః.......

(3) గోదావరీ సిన్ధుమలాపహారీ వేగావతీ నాదవతీ చ కృష్ణా ।
నద్యస్సమస్తా స్సతతం దిశంతు వటో..........

(4) కృష్ణాజినం దర్భమయీచ మౌంజీ పాలాశదండః పరిధాన శాటీ ।
యజ్ఞోపవీతం చ దిశంతు నిత్యం వటోశ్చిరాయు....

(5) తాంబూల గంధాక్షత పత్రపుష్ప దీపాంకురాశీర్వచనాని యాని ।
పుణ్యాహవాక్యాని దిశంతు తాని వటోశ్చిరాయుః......

(6) మందార ధాత్రీరుహ పారిజాత సంతాన కల్పద్రుమచందనాని ।
కల్పద్రుమాఖ్యాని దిశంతు తాని వటోశ్చిరాయుః......

(7) జంభారివైశ్వానర కాలపుణ్యాః సరిత్పతిర్వాయు కుబేర శర్వాః ।
ఏతే సదా దిక్పతయో దిశంతు వటోశ్చిరాయుః......

(8) ఓంకార సవ్యాహృతి మంత్రముద్రాః సావిత్రి గాయత్రి సరస్వతీ స్వరాః।
ఛందాంసి వేదాశ్చ దిశంతు సర్వేవటోశ్చిరాయుః......

* * * * * *

# నవగ్రహ మంగళ శ్లోకాః

(1) భాస్వాన్ కాశ్యప గోత్రజోఽరుణ రుచిః యస్సింహపోఽర్కస్సమిత్।
షట్త్రిస్థో దశ శోభనో గురు శశీ భౌమా స్సుమిత్రాస్సదా ।
శుక్రో మందరిపుఃకళింగ జనపశ్చాగ్నీశ్వరౌ దేవతే ।
మధ్యే వర్తుల పూర్వదిగ్దినకరః కుర్యాత్సదా మంగళమ్ ॥

(2) చంద్రః కర్కటక ప్రభు స్సితనిభశ్చాత్రే యగోత్రోద్భవ ।
శ్చాత్రేయ శ్చతురశ్రవారుణ ముఖశ్చాపోహ్యుమా ధీశ్వరః ।
షట్సప్తాగ్ని దశైక శోభనఫలో నోరిర్బుధార్కౌ ప్రియౌ ।
స్వామీ యామునజశ్చ పర్ణ సమిధః కుర్యాత్సదా మంగళమ్ ॥

(3) భౌమో దక్షిణ దిక్ త్రికోణ యమజోఽవంతీశ్వరః ఖాదిరః ।
స్వామీ వృశ్చికమేషయోస్సుర గురుశ్చార్కశ్శశీ సౌహృదః ।
జ్ఞోరిష్షట్త్రి ఫలప్రదశ్చ వసుధా స్కందౌ క్రమాద్దేవతే ।
భారద్వాజకులోద్భవోఽరుణరుచిః కుర్యాత్సదా మంగళమ్ -

(4) సౌమ్యః పీత ఉదఙ్ముఖ స్సమిదపామార్గో ఽ త్రి గోత్రోద్భవః ।
బాణేశాన దిశస్సుహృద్రవిసుత శ్శేషాః సమా శ్శీతగః ।
కన్యాయుగ్మ పతిర్దశాష్ట చతురష్షణ్ణేత్ర గశ్శోభనో ।
విష్ణుర్దేవ్యధి దేవతే మగధపః కుర్యాత్సదా మంగళమ్ ॥

(5) జీవశ్చాంగిర గోత్రజోత్తరముఖో దీర్ఘోత్తరాశాస్థితః ।
పీతోశ్వత్థ సమిచ్చ సింధు జనిత శ్చాపోథ మీనాధిపః ।
సూర్యేందు క్షితిజాః ప్రియా బుధసితౌ శత్రూ సమాశ్చాపరే ।
సప్తద్వే నవపంచమే శుభకరః కుర్యాత్సదా మంగళమ్॥

(6) శుక్రో భార్గవ గోత్రజ స్సిత రుచిః పూర్వాముఖః పూర్వదిక్ ।
పాంచాలస్థ వృషస్తులాధిప మహారాష్ట్రాఽధిపోదుంబరః ।
ఇంద్రాణీ మఘవా బుధశ్చ రవిజో మిత్రోర్క చంద్రావరీ ।
షష్ఠత్రిర్దశ వర్జితే భృగు సుతః కుర్యాత్సదా మంగళమ్ ॥

(7) మందః కృష్ణనిభ స్సపశ్చిమ ముఖస్సౌరాష్ట్రపః కాశ్యపః ।
స్వామీ నక్ర సకుంభయో ర్బుధసితౌ మిత్రౌ కుజేందూ ద్విషౌ ।
స్థానం పశ్చిమ దిక్ప్రజాపతి యమౌదేవౌ ధనుష్యాసనష్షట్త్రి
స్థశ్శుభ కృచ్ఛమీ రవి సుతః కుర్యాత్సదా మంగళమ్ ॥

(8) రాహు స్సింహళ దేశపో నిర్ఋతిః కృష్ణాంగ శూర్పాసనః ।
యఃపైఠీనసగోత్ర సంభవ సమిద్దూర్వాముఖో దక్షిణః ।
యస్సర్పః పశుదైవతో ఖిల గత స్స్వామ్యా ద్విశేషప్రదః
షట్త్రి స్థశ్శుభకృచ్చ సింహిక సుతః కుర్యా త్సదా మంగళమ్ ॥

(9) కేతుర్జైమిని గోత్రజః కుశ సమిద్వాయవ్య కోణేస్థితః ।
చిత్రాంక ధ్వజలాంఛనోహి భగవాన్ యోదక్షిణాశాముఖః ।
బ్రహ్మో చైవచ చిత్రగుప్త పతిమాన్ ప్రత్యాధి దేవౌసదా ।
షట్త్రిస్థ శ్శుభకృచ్చ బర్బరపతిః కుర్యాత్సదా మంగళమ్ ॥

(10)ఇత్యేతద్గ్రహ మంగళాఖ్యక మిదం లోకోపకార ప్రదం ।
పాపౌఘ ప్రశమం మహాఽభయకరం సౌభాగ్య సంవర్ధనం ।
యః ప్రాతశ్శృణుయాత్పఠే దనుదినం శ్రీకాళిదాసోదితం ।
భుక్తిం ముక్తి మసౌ భజేచ్చ సతతం విందేత్సదా మంగళమ్ ॥

ఇతి శ్రీకాళిదాస కవికృత నవగ్రహ మంగళశ్లోకా స్సమాప్తాః

* * * * * *

# దశావతార మంగళ శ్లోకాః

(1) ఆదావంబుజ సంభవాది వినుతశ్శాంతో జ్వలశ్శాశ్వతః ।
సంఫుల్లామల పుండరీకనయనః పుణ్యః పురాణః పుమాన్ ।
లోకేశ శ్శృతి చోర సోమకహరో మత్స్యావతారో హరి
శ్శ్రీమాన్ సింహగిరీశ్వరః కరుణయా దద్యాత్సదా మంగళమ్

(2) సప్తద్వీప కులాచలేంద్ర జలధిస్తోమాభి సక్రంద భూ
భారాలీఢ ఫణీంద్ర మండల ధరో మందార మాలార్చితః ।
భావజ్ఞో బహు చక్రలాంఛిత ధనుః కూర్మావతారో హరి
శ్శ్రీమాన్.......... మంగళమ్

(3) లీలాలోడిత సర్వసాగర జలస్సంపూర్ణ చంద్రప్రభుః ।
హేమాక్షా సుర ఖండనో భుజగదశ్చక్రాంకిత స్సంతతమ్ ।
దంష్ట్రోగ్రోధృత మేదినీ భయహరః క్రోడావతారో హరి
శ్రీమాన్.......... మంగళమ్

(4) కుందేందు స్ఫటిక ప్రభా బహుభుజో భూషా సహ ప్రోజ్వలో
దైత్యేంద్ర ప్రవిదారణేతి నిపుణస్సం భోద్భవో భీషణః ।
ప్రహ్లాదార్తి హరోదయో నరమృగాకారావతారో హరి
శ్రీమాన్........ మంగళమ్

(5) ధాతృక్షాళిత పాదపంకజ భవక్రోశోమహాశాంబరః ।
ప్రక్షాళీ కృత పాద పద్మయుగళో హేలాజగజ్జీవనః ।
భిక్షార్థీ బలిదర్పహా పటువటుః ఖర్వావతారో హరి
శ్రీమాన్........ మంగళమ్

(6) సద్యః ఖండిత రాజమండల శరీరోద్భూత రక్తాపగః ।
సమ్యక్తర్పిత పైతృకః పితృవచస్సంపాలనే నిష్ఠితః ।
వేదజ్ఞో జమదగ్నిజః పరశుభృద్రామావతారో హరి
శ్రీమాన్.......... మంగళమ్

(7) రాజేంద్రో రణరంగ రాజ విజితానేకాసురా భాసు రాఽకారా
రావణ కోటిఖండన పటుః కోదండ దీక్షా గురుః ।
సీతేశస్సుర సజ్జనావన పరో రామావతారో హరి
శ్రీమాన్......... మంగళమ్

(8) కాళిందీ బలభేదనో బలభుజః ప్రీతః ప్రలంబాసుర

ప్రధ్వంసీ ముసలాయుధో హలధరో నీలాంబరో నిర్మలః ।

లావణ్యామిత రేవతీ ప్రియవరో రామావతారో హరి

శ్శ్రీమాన్........ మంగళమ్

(9) ధర్మజ్ఞ స్త్రిపురాధి నాథ వనితా ధర్మోపదేష్టా చతుః ।

పాతివ్రత్య విశేష భంజన పరో వేదాంత వేద్యస్సదా ।

దైత్యవ్రాత వినాశనాతి చతురో బుద్ధావతారో హరి

శ్శ్రీమాన్......... మంగళమ్

(10)మ్లేచ్ఛ వ్రాత వినాశనః కలియుగాంతే అశ్వాధిరూఢో

మహామాయావీ బహుభాను కోటి సదృశో భీమాసి చక్రాయుధః ।

యశ్శార్ఙ్గీకృత కల్కిరూప విభవో భూమౌ సవిప్రాన్వయః

శ్రీమాన్ సింహగిరీశ్వరః కరుణయా దద్యాత్సదా మంగళమ్ ।

* * * * * *

# చూర్ణికా

స్వస్త్యష్టాశీతి సహస్రాణాం ద్విజగురు దైవతానాం పురుహూత హుతవహదండధరనిశాచర పాశపాణిసమీరణవైశ్రవణశశిశేఖరాణాం. ఆయుష్మతః కమలాసనస్య । సకలదురితనివారణస్య లక్ష్మీనారాయణస్య । ఆద్యంతరహితస్య గౌరీమనోవల్లభస్య । తేజస్వినస్సవితుః। ప్రజ్ఞాగురోస్సురగురోః । సర్వశుభఫలదాయకస్య, పుష్పసాయకస్య । సత్యసన్ధస్య హరిశ్చన్ద్రస్య । దుర్వారవీర్యస్య, కార్తవీర్యస్య । నయనానన్ద కరస్య శ్రీరామచన్ద్రస్య । మృకణ్డుముని తనయస్య మార్కణ్డేయస్య । తపోనిష్ఠస్య వసిష్ఠస్య । అమ్భోనిధికుమ్భినీధరవి జృంభణస్తమ్భనస్య కుంభసంభవస్య । యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహారధారణాధ్యానసమాధ్యష్టాఙ్గయోగనిష్ఠాగరిష్ఠానాం మునిముఖ్యానాం। అరున్ధతీ లోపాముద్రాఽనసూయా సీతా సావిత్రీ ప్రభృతీనాం సతీనాం । గఙ్గాయమునా సరస్వతీ నర్మదా గోదావరీ తుఙ్గభద్రా కృష్ణవేణీ కావేరీ తామ్ర పర్ణ్యాది మహానదీనాం । శ్రీశైలసువేలసురనివాసకైలాసాదీనాం శైలానాం । మన్దార హరిచన్దనాది బృన్దారక తరూణాం । జమ్బూప్లక్షాశ్వత్థపలాశన్యగ్రోధో దుమ్బరాది వనస్పతీనాం । కమల కల్హార మల్లికాజాజీ కదమ్బకేసర కాఞ్చనాది పుష్పజాతీనాం । వజ్రవైఢూర్య మరకత మాణిక్య ముక్తాప్రవాళాది నవరత్నానాం । చిన్తామణి కౌస్తుభ కామధేనూనాం ।

ఋగ్యజుస్సామాఽథర్వణ వేదానాం । శీక్షావ్యాకరణాది వేదాఙ్గానాం । జగన్మాయా విలాసస్య సచ్చిదానన్ద విగ్రహస్య పరబ్రహ్మణః । భూకిరణ కళాప్రపూర్ణయోశ్చన్ద్ర సూర్యయోః । సత్త్వరజస్తమో గుణాత్మక త్రిలోకానాం । బ్రహ్మణశ్చతుర్ముఖానాం । పరమేశ్వరస్య పంచముఖానాం । కుమారస్వామినష్షణ్ముఖానాం । సప్తర్షీణాం । అష్టవసూనాం । నవగ్రహాణాం । దశావతారాణాం । ఏకాదశరుద్రాణాం । ద్వాదశాదిత్యానాం । త్రయోదశ విశ్వేషాం దేవానాం । చతుర్దశ మనూనాం । పంచదశాహుతీనాం । షోడశకళానాం। సప్తదశప్రజాపత్యక్షరాణాం । అష్టాదశ విద్యానాం । అష్టావింశతి నక్షత్రాణాం। త్రయస్త్రింశత్కోటి దేవతానాం । రమణీయ భూషణానాం గీర్వాణ తరుణీనాం । ధర్మపత్నీ సమన్వితానాం విద్వద్బ్రాహ్మణానాం । అవిఘ్నకృత శ్రీవినాయకస్య ప్రసాదేన, అస్యవటోః (అనయోర్దంపత్యోః) ఇక్షుక్షీరదధి మధుఘృత గోరోచన జీరకగుడ హరిద్రాది ద్రవ్యాణి, సర్వౌషధయః, సర్వ సస్యాని, మఙ్గళకరాణి భవన్తు, తిథివార నక్షత్రయోగ కరణముహూర్త లగ్నహోరాద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశదంశాంశకాః నిరన్తర మనుకూలా శ్శుభా శ్శోభనాః అస్య..... ముహూర్తస్య, సుతిథిం, సువారం, సునక్షత్రం, సుయోగం, సుకరణం, సుచన్ద్ర తారాబలం కల్పయన్తు. సర్వేగ్రహాస్సనక్షత్రాః సుప్రీతాస్సుప్రసన్నా శ్శుభైకాదశస్థాన ఫలదావరదా భవన్తు ।

* * * * * *

# కూశ్మాండ హోమాః

ఆచమ్య...ర్థం భ్రూణహత్యాయా అర్వాచీనైనో నిబర్హణార్థం కూశ్మాండై ర్హోష్యామి, ఇతి సంకల్ప్య । అగ్నీంధనాదిషట్పాత్రప్రయోగం కుర్యాత్ । అగ్నే రుపసమాధానాద్యాజ్యభాగాంతే ముఖాహుతిం హుత్వా, పక్వా జ్జుహోతి । - ఓం భూర్భువస్సువః... ప్రచోదయా త్స్వాహా ॥ సవిత్ర ఇదమ్ ॥ ఆజ్యేన॥ భూ స్స్వాహా॥ అగ్నయ ఇదమ్ ॥ భువ స్స్వాహా ॥ వాయవ ఇదమ్ ॥ సువ స్స్వాహా ॥ సూర్యాయేదమ్ ॥ ఓం భూర్భువస్సువ స్స్వాహా ॥ ప్రజాపతయ ఇదమ్ ॥ యద్దేవా దేవహేళనం దేవాస శ్చకృమావయమ్ । ఆదిత్యా స్తస్మాన్మా ముంచత ర్తస్యర్తేన మామిత స్వాహా ॥ దేవేభ్య ఆదిత్యేభ్య ఇదమ్ ॥ దేవాజీవనకామ్యా యద్వాచా నృత మూదిమ । తస్మా న్న ఇహ ముంచత విశ్వే దేవా స్సజోషస స్స్వాహా ॥ దేవేభ్య ఇదమ్ ॥ ఋతేన ద్యావాపృథివీ ఋతేన త్వగ్ం సరస్వతీ । కృతా న్నః పాహ్యేనసో యత్కించానృత మూదిమ స్వాహా ॥ ద్యావా పృథివీభ్యాగ్ం సరస్వత్యాఇదమ్॥ ఇంద్రాఽ గ్నీ మిత్రావరుణౌ సోమో ధాతాబృహస్పతిః । తేనో ముంచం త్వేనసో యదన్యకృతమారిమ స్వాహా ॥ ఇంద్రాగ్నిభ్యాం మిత్రావరుణాభ్యాగ్ం సోమాయ ధాత్రే బృహస్పతయ ఇదమ్ ॥ సజాతశగ్ంసాదుతజామి శగ్ం సా జ్యాయస శ్శగ్ంసా దుతవా కనీయసః ॥ అనాధృష్టం దేవకృతం యదేన స్తస్మాత్త్వ మస్మాఙ్జాతవేదో ముముగ్ధిస్వాహా ॥ అగ్నయే జాతవేదస ఇదమ్ ॥ యద్వాచా యన్మనసా బాహుభ్యా మూరుభ్యా మష్ఠీవద్భ్యాగ్ం శిశ్నైర్యదనృతం చ కృమా వయమ్ । అగ్ని ర్మాతస్మా దేనసః

